బొమ్మల

# నేతాజీ
# సుభాశ్చంద్రబోస్

మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మథర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాస్ చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" పరమానందయ్యశిష్యులు
" శ్రీ వెంకటేశ్వరలీలలు
" శ్రీ అయ్యప్పలీలలు
" శ్రీరామపట్టాభిషేకం
" జై వీర హనుమాన్
" పల్నాటివీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తిమహాత్మ్యం
" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీలకథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగలీలలు
" శ్రీ రాఘవేంద్రలీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు



# 1

"మహా భారత నివాసులారా,

మీరు ధన్యులు. మీ నేతాజీ ధన్యులు, మీ నేతాజీ స్థానం నాకంటె చాల ఉన్నతమైంది. నేను కేవలం ఎనిమిదికోట్ల జర్మనీయులకు నాయకుడను. కాని, వారు నలుబదికోట్ల భారతీయుల నాయకులు, ఆయన అన్నివిధాలా నాకంటె గొప్ప నాయకులు. నేను మరియు నా జర్మనీ సైనికులు ప్రణామం చేస్తాము. నేతాజీ నాయకత్వంలో విశాల భారతం ఒకరోజున తప్పక స్వతంత్రం పొందుతుందని నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది.

—హిట్లర్."



# 2

సోదరీ సోదరులారా!

అపార ఉత్సాహంతో మీరు నాకు స్వాగతం చెప్పినందుకు అన్నిటి కంటె ముందుగా నా హృదయపూర్వక కృతజ్ఞతలు. అందులో విశేషించి అధిక సంఖ్యలో పాల్గొన్న సోదరీ మణులకు నా ధన్యవాదాలు.

ఇప్పుడు నైతిక—భౌతిక రెండు విధాలైన సహాయాలు మన దేశ వాసులకు కావలసి ఉంది. విజయం తప్పనిసరి మనది అనే విశ్వాసం ముందుగా మనం కలిగుండాలి.

ఈ విరోధి సైన్యాల తలవంచడానికి మనం బెదరి పోవల్సిన పనిలేదు. దేశం లోపల వెలపల ఉన్న భారతీయులు తమ కర్తవ్యపాలన చేయగలిగితే చాలు ఆంగ్లేయులను దేశంనుంచి తరిమివేసి ముప్పది ఎనిమిది కోట్ల భారతీయులకు స్వతంత్రాన్ని ప్రసాదించగలరు.

ఇక్కడ సమావేశమైన జన సమూహం నుంచి నేను మూడు లక్షల సైన్యాన్ని ముప్పది లక్షల డాలర్లను (మూడు కోట్ల రూపాయలు) ఆశిస్తున్నాను.

నేను భారత వీరనారీ మణులతో ఒక సేనా పటాలాన్ని ఏర్పరచ తలచుకుంటున్నాను. వారు మృత్యువును లెక్కచేయక 1857 లోని స్వాతంత్ర్య సంగ్రామంలో వీర ఝాన్సీరాణివలె కత్తుల నెత్తిపట్టి శత్రువుల నెదిరించగలరు.

మిత్రులారా! మనం చాల కాలంనుంచి యూరోపులో రెండవ సేనను గూర్చి వింటున్నాం. కాని మనవాళ్ళు మనదేశంలో అతిగా అణచివేయబడు తున్నారు. తూర్పు ఆశియాలో మీ సంపూర్ణ సహకారాన్ని అందించండి. నేను భారత స్వాతంత్ర్య పోరాటపు నిజమైన రెండవ సేనను అందిస్తానని వాయిదా చేస్తున్నాను. విప్లవం వర్ధిల్లాలి. జైహింద్!

— సుభాస్.

## 3

"ఆజాద్ హింద్ ఫౌజ్" భారత విముక్తి పోరాటంలో నన్ను సర్వ సేనాధిపతి స్థానంలో నిలిపినందుకు కృతజ్ఞుడను. ప్రతి సందర్భంలోనూ భారత దేశాన్ని గురించిన కర్తవ్యపాలనకోసం నాకు అవసరమైన శక్తిని ప్రసాదించ వల్సిందిగా పరమేశ్వరుని వేడుకుంటున్నాను.

స్నేహితులారా! అధికారులారా మరియు సైనికులారా! మీ కార్యశక్తి-దేశభక్తి సహకారంవల్ల ఈ ఆజాద్‌హింద్ సేన క్రాంతికి సాధనం కాగలదు. విజయం మనది అని విశ్వసనీయంగా చెప్తున్నాను.

హెడ్ క్వార్టర్స్-సిపహసాలర్
ఆజాద్ హిందూఫౌజ్
25 ఆగస్టు 1943.

సుభాశ్చంద్రబోసు
(ప్రధాన సేనాధిపతి.)

## 4

స్వతంత్ర భారత సేన మార్చింగ్ సాంగ్—

జయహో జయహో!

శుభ సుఖ ప్రశాంతి వర్షం కురిసి భారతదేశం మేల్కొంది

పంజాబ్ సింధు గుజరాతు మరాఠీ ద్రావిడ ఉత్కళ వంగా

చలిత సాగరం యమునా గంగా హిమగిరి వింధ్యాచలమూ
నీ సద్గుణములు పాడు-నీతో బ్రతుకుట కోరు
- అందరి కాంక్షలు తీరు -
భారత నామము సూర్యకాంతిగా మారి విశ్వమున మీరు
జయహో జయహో !

## 5

తాత్కాలికంగా బర్మాలో బోసు నాయకత్వాన ఏర్పడిన ఆజాద్‌హిందూ ప్రభుత్వాన్ని జపాన్, ఇటలీ, జర్మనీ, బర్మా, థాయిలాండ్ మొదలైన దేశాలు బల పరచి నేతాజీ సుభాశ్చంద్రబోసుకు శుభాకాంక్షలు పంపాయి.

ఝాన్సీలక్ష్మీబాయి జన్మదినం రెండవరోజున ఈ ప్రభుత్వం తమ ప్రత్యేక రేడియో కేంద్రంనుంచి చేసిన ప్రసారంలో బ్రిటన్ అమెరికాలపై యుద్ధాన్ని ప్రకటించింది. నూతన స్వతంత్ర భారత ప్రభుత్వం.

ప్రపంచం ఆశ్చర్యంతో నోళ్ళు తెరచింది.

# 6

జర్మనీ జపానులకు మిత్రుడుగా బ్రిటన్ అమెరికాలకు శత్రువుగా ఆజాద్ హిందూఫౌజు నేర్పరచి, స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని నిర్మించి, జపాన్ ద్వారా జయించబడిన అండమాన్ నికోబార్ దీవులను తీసుకొని వాటికి అమరవీర స్వరాజ్య దీపాలుగా నామకరణంచేసి, త్రివర్ణ పతాకాన్ని ఎగరవేసి అజేయంగా బ్రిటిన్ సేనలను ఎదిరిస్తూ మణిపూర్, ఇంఫాల్‌లను స్వాధీన పరచుకొని, 'చలో ఢిల్లీ' అని ముందుకు సాగాడు నేతాజీ సుభాశ్చంద్రబోసు.

జపాన్, రష్యాపై పోరాటానికి దిగటంతో అమెరికా, జపాన్ నగరాల పై బాంబులు వేసింది. ఆ విధ్వంసకాండకు భయపడి జపాన్ యుద్ధ విరమణ చేయటంతో కథ అడ్డం తిరిగింది.

బ్రిటిష్ సేనలు విజృంభించాయి. ఆజాద్ హిందూసేన వెనుకకు అడు గేయవల్సి వచ్చింది. టోక్యోకు వెళ్తూ బోసు విమాన ప్రమాదం పాలయ్యాడు.

ఆజాద్ హిందూసేనా నాయకులను బందీ కావించి ఆంగ్ల ప్రభుత్వం ఢిల్లీ ఎర్రకోటలో తాత్కాలిక మిలిటరీ కోర్టును ఏడుగురు జడ్జిలతో ఏర్పరచి న్యాయ విచారణ జరిపించింది.

మీరట్ కుట్రకేసులో వాదించిన తేజ్ బహద్దూర్ సప్రూ వృద్ధుడు అశక్తుడైనా ఉచితంగా నిందితుల పక్షాన నిలిచాడు. అయనకు సహాయంగా బొంబాయినుంచి భూలాభాయి దేశాయి వచ్చాడు. జవహర్‌లాల్ నెహ్రూ ఏనాడో వదిలేసిన నల్లకోటు తిరిగి ధరించుకొని కోర్టుకు చేరాడు. దిలీప్‌సింగ్, బక్షీ, సి.కె. సేన్, కైలాసనాధ్ భట్టూ దేశభక్తులైన న్యాయవాదుల తోడ్పాటుకు కొరతలేదు.

కర్నల్‌షా నవాజ్ ఖాన్, కెప్టెన్ ప్రేంకుమార్ సైగాల్, లెఫ్టినెంట్ గురుబక్షీసింగ్ ధిలన్, కెప్టెన్ మోహన్‌సింగ్, లెఫ్టినెంట్ నాగ్ మొదలైన భారత వీరులపై రాజద్రోహం, సైనికుల హత్య నేరాలు ఆరోపించ బడ్డాయి.

మేజర్ కాటకూరా, కెప్టెన్ షద్ మొ॥వారు సాక్షులు. గంభీర వాతావరణంలో చర్చలు సాగాయి.

ఒక స్వతంత్ర ప్రభుత్వం చేసిన చర్యలు తప్పులు కావని ప్రతిపక్షుల బలమయిన వాదన నడిచింది.

బ్రిటిష్ సేనలు జపాన్‌కు ఓడి, తమ్ము వేలాది సేనలను బందీలుగా తమ కర్మానికి వదలితే, రాస బిహారీబోస్, నేతాజీ దేశభక్తుల యాజమాన్యానికి బుద్ధిపూర్వకంగానే వశపడినామన్నారు సేనానులు.

వారిని కోర్టు తలతిక్కగా దోషులనే నిర్ణయించినా, తర్వాత సాగిన ప్రజా ఉద్యమాలకు, ఆందోళనలకు జడుసుకొని శిక్షలు రద్దుచేసింది ప్రభుత్వం.

1945 నవంబర్ 5నాడు ఆరంభమయిన ఈ విచారణ 3 జనవరి 1946 వరకు నడిచింది.

ఈ సంఘటన 1947 స్వతంత్ర సాధనకు బలమయిన నాంది అయింది.

ఇంతకు ఎవరు ఇంతటి విప్లవానికి కారకుడయిన ఆ నేతాజీ సుభాష్‌చంద్రబోస్-

వివరాలు చూద్దాం పదండి.

# నేతాజీ
# సుభాశ్చంద్రబోస్

## జననం

ప్రముఖ న్యాయవాది రాయబహద్దూర్ జానకీనాధ్ పదముగ్గురు సంతానంలో నేతాజీ సుభాశ్చంద్రబోసు ఒకడు.

వారి స్వస్థలం బెంగాళ్‌లోని కొడాలియా గ్రామం.

బోసు బాబు జన్మదినం, 30 జనవరి 1897.

ఒరిస్సాలోని కటక్‌లో బోసు జన్మించాడు. వృత్తిపరంగా జానకీనాధ్ అప్పుడక్కడే వుండేవాడు. ఆయన ఇల్లాలు ప్రభావతి ఉత్తమ ఇల్లాలు. ప్రేమమయి.

వారికి సంపాదనకు సంతానానికీ కొదువలేదు. అది ఇప్పటివలె మిత సంతానాన్ని కోరే కాలంకాదు. ఎందరు పిల్లలున్నా చింతిల్లేవారుకాదు. కాయకష్టం చేసుకొని బ్రతికేవాళ్ళుకూడా అధిక సంతానానికి వెరచేవారుకారు. పైగా మరిసే

వారంటే ఇక ధనవంతులనుగూర్చి చెప్పేదేమున్నది! పెద్ద కుటుంబాలు గౌరవంగానూ చూడబడేవి.



సుభాసుబాబు పుట్టినరోజున ఆ భవనం సన్నాయి పాటలు, మద్దెల మ్రోతలతో మార్మ్రోగిపోయింది. బంధుమిత్రుల సందడి పెరిగింది. వారి అభినందనలకు ఆ దంపతులు ఆనందించారు.

అందమయిన మరో పుత్రుడు జన్మించినందుకు ఆనందించారేకాని ఆ శిశువు పెరిగి చిచ్చరపిడుగై-పశుబలంతో కూటనీతితో మన దేశాన్ని ఆక్రమించుకొని పాలించుతున్న ఆంగ్లేయులకు ప్రక్కలో బల్లెమవుతాడని కలగనలేదు.

## బాల్యం

సుందరుడేకాదు సుగుణవంతుడు బోసుబాబనే విషయం ఆ బాలుడు పెరిగినకొద్దీ చేసే పనులబట్టి తెలియసాగింది.

కొడుకు ప్రవర్తన తల్లికి ప్రియంగా వుండేది. కాని అదే తండ్రికి నచ్చనిదయింది. కొడుకు ప్రజాసేవ ఆయనకు నచ్చలేదు. స్వతంత్ర ప్రీతీ నచ్చలేదు. ఎవరితోనూ ముఖ్యంగా ఆంగ్లేయులతో ఏ తగాదా పెట్టుకోక బుద్ధిగా చదువుకొని ఉన్నత ఉద్యోగంలో చేరి బాగా సంపాదించుకొంటూ సుఖంగా జీవించాలనేది ఈ కొడుకు విషయంలో ఆ తండ్రి ఆశ.

బాల్యంలో తోటి బాలబాలికలందరూ ఆటపాటల్లో ఉత్సాహంగా కాలం గడుపుతుంటే బోసుబాబు మాత్రం ఏకాంతంలో కూర్చొని మౌనంగా, గంభీరంగా ఆలోచిస్తూ వుండేవాడు.

విశాలమయిన నుదురు, ప్రకాశవంతమయిన నేత్రాలు, బంగారు రంగు మేనితో కన్పించే ఆ బాబులో గౌతముని కరుణ, భీముని బలం జతగా వుండేవి. రెండు పరస్పర విరుద్ధాలయిన భావాలు ఒకే వ్యక్తిలో వుండడం ఎలా సాధ్యం? అంటే-అది ఆయా వ్యక్తుల స్వభావాలపై ఆధారపడి వుండేవిషయం.

తెల్లవాళ్ళ పిల్లలనుచూస్తే మండిపోయేవాడు బోసు. వారితో కల్సి తిరగడమే గొప్పగా భావిస్తూ భారత ధనిక బాలురు వారి స్నేహాలకు తపన పడే వారు. దానికి బోసు విలోమం.

వారి మాటల్లో కనిపించే గర్వానికి పాటల్లో ధ్వనించే అన్యజాతి నిందకూ పరితపించేవాడు బాల సుభాస్. కోపంతో నిండిపోయేవాడు.

ఆంగ్లేయులు ఎవరు? అనే విషయం గురువులవల్ల తెల్సుకున్నాడు. తల్లి దుర్గాదేవి పూజ చేసేటప్పుడు బోసు భక్తితో "మాతా దుర్గా! ఈ పరాయి దేశం వాళ్ళను మా దేశంనుంచి వెళ్ళగొట్టు" అని మనసులోనే ప్రార్థించేవాడు.

ఆయన చదువు మెట్రిక్ వరకు కటక్‌లోనే సాగింది.

## ఒకసారి ఏమయిందంటే...

"షటప్, యు బ్లాక్ ఇండియన్" అంటూ తరగతి గదిలోనే ఒక ఆంగ్లేయ బాలుడు భారత బాలుని షర్ట్‌కాలర్ పట్టి లాగి తిడుతూ తగాదా పడ్డాడు. కారణం ఏదయినా అక్కడ జరిగిన సన్నివేశమది. ఆ అబ్బాయి దిగ్భ్రమతో, భయంతో ముడుచుకుపోయాడు. ప్రక్కసీటులో కూర్చొని అదంతా చూస్తున్న బోసుబాబు గుండె మండిపోయింది. ఆంగ్లబాలునికి తగిన గుణపాఠం చెప్పాలను కున్నాడు. కాని అంతలో అధ్యాపకుడు తరగతి గదిలోనికి ప్రవేశించడంతో ఆగి పోయాడు.

విశ్రాంతి గంటలో అవమానం పొందిన బాలునికల్సి ముచ్చటించాడు బోసుబాబు.

"నువ్వు పిరికివాడివి దోస్త్, ఒకవేళ ఆ బద్మాష్ నాతోనే అలా అవమానకరంగా మెదలివుంటే వాడిని తన్ని తన్ని చూర్ణం చేసేవాడిని." అన్నాడు బోసుబాబు ఆవేశంగా.

"నేను ఒక్కడిని ఏం చేయగల్గుతాను" సహపాఠి అన్నాడు నిస్సహాయముగా.

"సాహసముంటే ఒక్కడయినా యెంతో సాధించవచ్చు. సరే-భయపడకు. నేను ఆ ఇంగ్లీషు పిల్లాడి పనిపడతాను నీ విషయంలో జరిగిన అవమానానికి బదలా తీర్చుకుంటాను. చుట్టీకానీ"

"అతడు ఏదో పెద్ద ఆఫీసర్ కొడుకు"

"ఎవడయినాకానీ, న్యాయం మానవులందరికీ ఒక్కటే. ఆ పిల్లవాడు అకారణంగా జాతిగర్వంతో నిన్ను అవమానించాడు. దాన్ని నేను సహించలేను"

అతడు భయపడి ప్రమాదం కలగవచ్చు ఊరోకుమ్మంటే అన్నాడిలా బోసుబాబు.

"నువ్వా విచారం పెట్టుకోకు. ఫలితం ఏదయినాకానీ అన్యాయాన్ని తప్పక ఎదిరించవల్సిందే అవమానాలను ఓర్చుకునే చేతగానితనమే మనలను ఆంగ్లేయులకు బానిసలను చేసింది."

ఆ పసి మనస్సులో ఎన్ని ఆలోచనలో-ఎంత వీరావేశమో.ఆ సాయంత్రం అన్నంతపని చేశాడు. గేటు దాటగానే ఆ ఇగ్లీషు పిల్లవాడ్ని చిత్తుగా తన్నాడు

"బద్మాష్-మళ్ళీ యెప్పుడయినా భారతీయ బాలురను అవమానించావా నీ ఎముకలు విరిచేస్తా జాగ్రత్త" అని హెచ్చరించాడు.



పగిలిన పెదవుల్ని అదిమిపట్టుకొని కన్నుల్లో నీళ్ళు నిండుకోగా తెల్ల మొగం వేసి నిలిచాడా తెల్లబాలుడు. నోటమాట రాలేదతనికిక.

బోసు వీరత్వాన్ని గురించి ఆ విద్యాలయంలో ముచ్చట్లు పెట్టుకో సాగారు.

# ఎంతటి కరుణామయుడో...

కొడుకును పిలుస్తూ ఒకనాడు ప్రభావతి సుభాస్ గదిలోకి వెళ్ళింది అతడు లేడు. టేబిల్‌పై చదువుకునే పుస్తకాలు అలాగే పడివున్నాయి. మంచం ఖాళీగా ఉంది. ఎటు వెళ్ళాడబ్బా, అనుకుంటూ ఆమె టేబిల్‌పై ఉన్న పుస్తకాలు సర్దసాగింది. ఇంతలో ఆమెకో వింత దృశ్యం కంటబడింది.

చీమల బారు! ఎడ తెగకుండా నడుస్తున్నది బాబు అలమారీలోకి. ఇదేమిటి? ఏదైనా పురుగు చచ్చిపడి ఉందేమో అని అలమారీలోని పుస్తకాలు దుస్తులు తీసి పరీక్షగా చూడసాగింది. పుస్తకాల దొంతర వెనక కాగితపు మడతలో దాచిపెట్టిన రెండు ఎండురొట్టెలు కన్పించాయి. వాటికే చీమలు పట్టాయి

ఇదేమిటి? వీడికిదేం పని! అనుకుంటూ ఆమె వాటిని తీసి బయట పడ వేసి శుభ్రపరచింది.

ఇంతలో సుభాస్ వచ్చాడక్కడికి. తనయుని చూస్తూనే తల్లి అడిగింది "ఇదేమిట్రా బాబూ? రొట్టెలు దాచిపెట్టావ్."

"ఏం చేశావమ్మా వాటిని?" అన్నాడతడు.

"పారవేశాను."

"మంచిపని చేశావమ్మా, ఇక వాటి అవసరంలేదు." అని అంటుండ గానే ఆ బాబు గొంతు గాద్గదికమైంది. కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి.

"ఏమైందిరా నీకు? ఈ రొట్టెలేమిటి? ఆ కన్నీళ్ళేమిటి?"

"నేను రోజూ నా భోజనంలో రెండు రొట్టెలు మిగిల్చి మా బడి ముందున్న ముసలమ్మ కిచ్చేవాడిని. నిన్న అవి తీసుకెళ్ళితే ఆమె కన్పించలేదు. తర్వాత ఇద్దామని వాటినిక్కడ దాచి ఉంచాను. ఇప్పు డక్కడికే వెళ్ళి వస్తున్నాను. ఆమె చనిపోయిందట." అని నిజంగానే ఏడ్వసాగాడు.

"నువ్వు మనిషివి కాదుబాబూ; అవతార పురుషుడివి!" అంటూ ఆ తల్లి కొడుకును అక్కున చేర్చుకొని 'నా కడుపు ధన్యమైంది' అనుకుంది.

"పేదలకు సాయం చేయడం మన కర్తవ్యం. ఇందులో విశేషం ఏముందమ్మా?" అని అతడు అక్కడినుండి కదలివెళ్ళాడు.

# దీన జన సేవలో

ఒకనాడు వార్తాపత్రిక చదువుతూ ఉంటే 'జాజ్‌పూర్'లో భయంకరమైన కలరా' అనే శీర్షిక కన్పించింది. అక్కడి రోగపీడితుల గూర్చి మృతుల గురించి హృదయ విదారకమైన వర్ణనను చదివాడు. దానితో ఆ బాలుడు అంతులేని దుఃఖాన్ని పొందాడు.

మృత్యువు విశృంఖల వీర విహారం చేస్తున్న ఆ ప్రాంతానికి వెళ్ళి అక్కడి నిస్సహాయులకు సేవ చేయాలనే సంకల్పానికి లోనయ్యాడు. అదే ఆలోచనలో మునిగిపోయాడు.

"నిస్సహాయులైన గ్రామీణులు మహామారివల్ల దుర్మరణాల పాలవుతున్నారు. మేం రుచికరమైన భోజనాలు చేస్తూ ఉన్నత సౌధాల్లో సుఖంగా ఉంటు

న్నాం. ఏమిటిది? వాళ్ళదేం దుస్థితి. ఆ బాధామయ విషయాలను విని మౌనంగా ఉండటమేనా? అలాగయితే మనం పశువులకంటే హీనం కదా-"

తన విచారానికి కారణం అడిగిన బాల్య స్నేహితురాలు మృదులతో తన మనోవ్యధను కొంత వివరించాడు. తన నిశ్చయాన్ని ఆమెకు తెలిపి ఇంట్లో ఎవరికి తెలుపకుండా జాజ్‌పూర్ వెళ్ళాడు.

అక్కడ బాల సుభాశ్చంద్రుడు మాసాల తరబడి రోగుల సేవలో గడిపాడు. ఆ నిరాడంబరత, వినమ్రత, సేవా తత్పరత చూసి సంఘ సేవకులు అధికారులు ఆనందించారు-అభినందించారు. ఆ బాబు ప్రముఖ న్యాయవాది జానకీ నాథ్ కుమారుడనే విషయం తెల్సి అమితాశ్చర్యం చెందారు.

## స్వగృహం చేరాడు

తిరిగి రాగానే మొట్టమొదట తండ్రి పాదాలకు నమస్కరించాడు బోసు బాబు. వినయంగా అన్నాడిలా "క్షమించండి నాన్నగారూ! మీ ఆజ్ఞ లేకుండా జాజ్ పురికి వెళ్ళాను."

"క్షమించడమా?" దీర్ఘంగా నిట్టూర్చాడు తండ్రి. తన మాట వినటం లేదనే కాక ఇలాగయితే కొడుకు చివరికి ఏమైపోతాడో అనే బెంగ ఆ తండ్రిది.

"ఇప్పుడు క్షమతో అవసరమేముంది? నువ్వెప్పుడూ నా గౌరవానికి భంగకరంగానే మెదలుతున్నావు. ఒక ప్రసిద్ధ న్యాయవాది పుత్రుడనని, అందుకు తగిన స్థాయిలో మెదలాలనే జ్ఞానం నీకుండాలి."

"నాకు తెలిసినంతవరకు నేను మీ ప్రతిష్ఠకు విరుద్ధంగా ఏమీ మెదల లేదు."

"ఇప్పుడా ప్రస్తావన దేనికి? నీ సేవ అవసరమే ఉందా అక్కడ? నువ్విలాగే చేస్తుంటివా నీ బ్రతుకు అంధకారమయమై పోతుంది."

"నాన్నగారూ! సేవాకార్యం నిందతెచ్చేది కాదుకదా?"



"అది ఈ రాయబహద్దూర్ కుటుంబానికి అవమానకరమైందే"

మరేమీ మాట్లాడలేదు బోసు.

"వచ్చావా నాన్నా!" అంటూ ప్రేమతో అక్కడికి చేరవచ్చిన తల్లి ఒడిలో ఒదిగిపోయాడు.

"నీ గుడ్డిప్రేమే వాణ్ణిలా పిచ్చిపనులకు ప్రేరేపించుతున్నది." అని రాయబహద్దూర్ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. కొడుకును చూసిన ఆనందంలో ఆమె భర్త నిందను పట్టించుకోలేదు.

"శుభాకాంక్షలు సుభాస్‌బాబూ! నాకు మిఠాయి తినిపించాలిమరి" అంటూ అక్కడికి వచ్చింది మృదుల.

"ఏమిటి విశేషం?" నవ్వుతూ అడిగాడు బోసు.

"ఇదుగో చూడు! మెట్రిక్‌లో నువ్వు సెకండ్ క్లాసులో ప్యాస య్యావు." చేతిలోని పత్రిక చూపింది.

"ధన్యవాదాలు మృదులా! మంచి వార్త వినిపించావు. పరీక్షలో ప్యాసయ్యే ఆశ అప్పటి అస్తవ్యస్త పరిస్థితినిబట్టి నాకు లేకుండె."

"నాకు నీ ఉత్తీర్ణతగూర్చి ఎలాంటి సందేహంలేదు. సరిగా చదవకనే సెకండ్‌క్లాసులో ప్యాసయ్యావంటే, ఇంకాబాగా చదివిఉంటే ప్రథమశ్రేణి వచ్చి ఉండేది. సరేకాని, నాకు తొందరగా మిఠాయి తినిపించి నోరు తియ్యగాచెయ్యి."

"అరె! నువ్వు మిఠాయి తినడం ఎప్పుడారంభించావ్? ఉప్పు కదా నీకు మహా ఇష్టం!" అన్నాడు సుభాస్.

"ఇదుగో నువ్వు నన్ను మోసపుచ్చే ప్రయత్నం చెయ్యకు." ఇద్దరూ నవ్వుకున్నారు. అది 1918 సంవత్సరం. తండ్రి సంతోషించాడు ఆ వార్తవిని.

కొడుకు వచ్చి పాదాభివందనం చేసేసరికి "వచ్చే సంవత్సరం నువ్వు కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుకోవాలి" అన్నాడు.

"మీ యిష్టం" అని కదిలాడు సుభాష్.

"చిరంజీవ!" తండ్రి ఆశీర్వాదం.

## కలకత్తా కాలేజీలో

పౌర్వాత్య సంస్కృతి సంప్రదాయాలు కలది ప్రెసిడెన్సీ కళాశాల. దానికి చాల మంచి విద్యాసంస్థగా పేరుంది. అందులో ధనికుల ప్రముఖుల పిల్లలకు తప్ప సామాన్య కుటుంబీకులకు ప్రవేశం లభ్యమయ్యేదికాదు. భారత దేశంలోని ఆంగ్లేయ అధికారుల కుర్రాళ్ళు ఎక్కువగా అక్కడే చదువుకునేవారు. ఏ కొందరో భారతీయ బాలురు-యువకులు మాత్రం ఉండేవారు.

సుభాష్ ఎఫ్.ఏ.లో చేరాడు. అక్కడి ఆర్భాటంచూసి ఆయన మనస్సు చివుక్కుమంది. తన అభిరుచికి ఆ కళాశాల భిన్నమైందని కొద్ది కాలానికే గమనించాడు. అక్కడ చదువుకుంటున్నా ఆ మూసలో పడిపోలేదు. తోటి విద్యార్థులకు దూరంగా ఉండేవాడు. వారితో అధికంగా మాట్లాడేవాడు కాదు. వాళ్ళ ఆడంబర ప్రవర్తనను ఇష్టపడేవాడూ కాదు. ఎప్పుడూ తన చదువులో ఆలోచనల్లో లీనమై ఉండేవాడు.

అక్కడి ఆంగ్ల ప్రొఫెసర్ల విద్యార్థుల ధోరణి ఒప్పదగినదిగా లేదతనికి. ఆ కారణంగా వాళ్ళు భారత విద్యార్థులను చిన్నచూపు చూసేవారు. వీళ్ళు ఆంగ్ల విద్యార్థుల దుర్వ్యవహారాలను గూర్చి విజ్ఞాపన పత్రాలు అధికారులకు ఇచ్చినా వాళ్ళు పట్టించుకునేవారుకారు. దానితో బోసుబాబులో క్రాంతి బీజాలు నిప్పుకణాల వలె రగుల్కొన సాగాయి.

దుస్తుల్లోనూఅంతే. అందరూ సూటుబూటుల్లో షోకేలాటిప్‌టాప్‌గావస్తే తానుమాత్రం తెల్లని ధోతీచొక్కా ధరించేవాడు. హోటళ్ళలోనూ ఆహార విహారాల లోనూ వారి ప్రవర్తన నచ్చేదికాదు. "ఇది విద్యార్థి జీవితమూ? విద్యార్థి ఇలా భోగ విలాసాల్లో ఆడంబరాల్లో మునిగి ఉండడమా? చదువుకోవడం అనే విలువైన అంశాన్ని వదలి తమ అమూల్య జీవిత కాలాన్ని ఇలా భోగ విలాసాల్లో వ్యర్థ పరచుకోవడమేనా? మన సంస్కృతి సభ్యతలు ఏడపోతున్నాయి. గురు శిష్య సంబంధం ఇదేనా-కాదు. కాదు. మనం పూర్తిగా విదేశీయుల చేతి కీలుబొమ్మలమై పోయాం. ఇది వారి వరప్రసాదం. బుద్ధుడు, అశోకుడు, చంద్రగుప్త మౌర్యుడు మొ॥వారి వారసులం మనం ఇంత పతనం కాగూడదు. మన పతనానికి కారణం మనమే. వీటినుంచి విముక్తిపొంది, విదేశీయుల దుర్నీతినుండి బయటపడి మనం స్వతంత్రత కోసం పోరాడవల్సి ఉంది. లేకపోతే మన దేశంలో మన విలువ కుక్కలకంటె హీనంగా మారిపోవడం ఎంతో దూరంలో లేదు" ఇలా సాగేవి సుభాసు ఆలోచనలు.

బోసుబాబు ప్రవర్తనను సహ విద్యార్థులు చాటుకు హేళనగా ముచ్చ టించుకున్నా, అతని ఎదుట వెక్కిరించే సాహసం చూపేవారు కాదు. ఆయన అలాంటివి లెక్కపెట్టేవాడూ కాదు. భోగలాలసతో, ఆడంబరాలతో, చిత్తపూర్తి

లేక ఏ మహత్తర ఆశయం లేక కాలం వెళ్ళబుచ్చే వాళ్ళను నడపీనుగులుగా భావించేవాడు బోసుబాబు.

## ఆదర్శ మార్గంలో

అదే కాలంలో కలకత్తాలో డా॥ సురేశ్చంద్ర బెనర్జీ ఒక నూతన సంస్థను స్థాపించాడు. బ్రహ్మచారులుగా ఉంటూ జీవిత పర్యంతం దీన జన సేవ చేయడం ఆ సంస్థ సభ్యుల ఉద్దేశ్యం.

అలజడిలో ఉన్న సుభాసు మనస్సును ఆ సంస్థ ఆదర్శం ఆకర్షించింది. అక్కడికి వెళ్ళి తన సంకల్పాన్ని వివరించి అందులో సభ్యుడుగా చేరి దీక్ష తీసుకున్నాడు. ఈ యువకుని ఆదర్శానికి అచంచల నిర్ణయానికి బెనర్జీ ఆశ్చర్య పడ్డాడు-ఆనందించాడు.

ఆ సంస్థలో అద్భుతమైన పాత్ర నిర్వహించాడు బోసుబాబు. క్రమ శిక్షణతో మెలిగేవాడు. శ్రమపడి పని చేసేవాడు. కొద్ది కాలంలోనే తన ఆదర్శ ప్రవర్తనతో తోటి విద్యార్థుల మనస్సులను ఆకట్టుకొని అనేకులను ఆ సంస్థలో సభ్యుల కావించాడు.

దేశాన్ని గురించి తెలుసుకోవడం, దేశవాసులకు సేవ చేయడం, దేశ విముక్తికోసం నిర్భయంగా పోరాడటం సుభాసుకు అత్యంత ప్రియమైన విషయాలైనాయి.

దేశ సేవకోసం కఠోరమైన బ్రహ్మచర్య దీక్ష తీసుకున్న తరుణ యువకుడు బోసు ధీరుడు.

## వివేకానందుని దర్శనం

అదే కాలంలో స్వామీజీని చూడటం జరిగింది. ఆయన తేజస్సు, ఆదర్శం, దీక్ష బోసుబాబును ఎంతగానో ఆకట్టుకున్నాయి. స్వామి ప్రసంగం శ్రద్ధాసక్తులతో విన్నాడు.

వివేకానందుడు గొప్ప విద్యావంతుడు, ప్రతిభాశాలి, బ్రహ్మచారి. దీన జనసేవకు జీవితాన్ని అంకితం చేశాడు. దేశ విముక్తితోపాటు మానసిక దాస్యభావ విముక్తికోసం శ్రమించాడు.

సత్యసంశోధనకు అన్నిటికంటె విలువైన స్థానం ఇచ్చాడు. అదే ఆదర్శమార్గాన్ని చూపుతుందని, దేశ దీనజన ఉన్నతిని సాధించు మార్గమౌతుందని ప్రబోధించాడు.

బోసుకు స్వామీజీ ప్రసంగం ఎంతగానో నచ్చింది. ఆ యువ హృదయంపై చెరగిపోని ముద్రవేసింది. చైతన్యం మేల్గొంది. జ్ఞానతృష్ణ కలిగించి.

సత్యసంశోధనకు పూనుకొని, దేశ-దేశవాసుల దారిద్ర్యదాస్య నిర్మూలన రహస్యాన్ని తెలుసుకోవాలని, అందుకు పరిశ్రమించాలనీ అనుకున్నాడు. ఆధ్యాత్మిక రంగంలో అతని హృదయం పరుగులు తీయసాగింది.

## సన్యాసిగా మారాడు

సత్య సందర్శనంకోసం మహర్షులు తపస్సు చేస్తారని విన్నాడు. ఉప



వాస దీక్షతో తపస్సు ఆరంభించాడు. ఏకాంతంలో గంటల తరబడి మౌనంగా గడిపేవాడు. శరీరం నిర్బలమైంది కాని సత్యం తెలియలేదు.

ఏకాంతధ్యానం శరీరానికి కష్టం కలిగించేదే తప్ప వేరే ప్రయోజనం లేదని గ్రహించాడు. నగరాన్ని విడిచి అడవుల్లోకి వెళ్ళాడు. అటునుంచి తిరిగి నగరానికే వచ్చాడు. కలకత్తా సమీపంలోని ఒక సుప్రసిద్ధ మఠానికి చేరుకున్నాడు సుభాష్.

ఆ మఠాధికారి సన్యాసిగా కనిపించే సంసారి. ఆయన చుట్టూ శిష్యులు, భక్తులు అధికంగానే ఉండేవారు. కాని, ఆ సన్యాసి దృష్టి పరలోక విషయాల కంటె ప్రపంచ విషయాలపైననే అధికంగా తగిలి ఉండేది. బోసుకు అతడు నచ్చ లేదు. ఆ చోటు వదిలాడు. సత్యాన్వేషణ నిలువనీయలేదు. తీర్థయాత్రలు ఆరంభించాడు. నిలకడ లేకుండా ఒక చోటినుండి మరోచోటికి తిరిగేవాడు.

ఎక్కడైనా ఏ సిద్ధ పురుషుడో కనిపించి తనకు మూలసత్యాన్ని వివరించక పోతాడా, అనే ఆశ ఉత్తదే అయింది.

ఒకానొక మతసంస్థలో సాధువులు రోతగా మెదలటం చూశాడు మనసు వికలమైంది. దుఃఖం కలిగింది.

"ఇదంతా కపట నాటకం, బూటకం, సత్యం ఈ మఠాల్లో లేదు. ప్రజల్లోనే ఉంది. సమాజంలో ఉండే సత్యాన్ని వెదకడంలో సఫలత సాధించాలి" అనుకున్నాడు.

తన తీర్థయాత్రలకు స్వస్తిచెప్పి, చిలుక పలుకుల వైరాగ్యాన్ని వదలి పెట్టి తిరిగి నగరానికి చేరుకున్నాడు.

అతని మనస్సులో వివిధ ఆలోచనలు వచ్చేవి.

"ఈ నా జీవితం ఏదో ప్రత్యేకతను సాధించడానికే వచ్చింది. దాన్ని సాధించడానికి నేనేదైనా విశేష మార్గాన్ని అనుసరించ వల్సింది కాని, జన సామాన్యంవలె జీవన ప్రవాహంలో పడిపోను." అనే నిశ్చయానికి వచ్చాడు.

# ఇంటికి చేరుకున్నాడు

ఇన్నాళ్ళ కాశీ గయా బృందావనం యాత్రలతో నియమ నిష్టలతో సుభాసు బాగా చిక్కిపోయాడు. పరిచితులైనా అతన్ని వెంటనే గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు.

ఇంట్లో అతని రాకకు అందరూ సంతసించారు.

మొదట తండ్రికి నమస్కరించాడు.

"సుఖంగా జీవింతువుగాక" అని కంపించే స్వరంతో పలికి ఇంకా ఇలా అన్నాడు జానకీనాథబోసు.

"లోకంలో కొందరు పిల్లలు తమ తల్లిదండ్రులకు దుఃఖాన్ని కల్గించడానికే పుడతారు. నా సంతానం నా అభిప్రాయాలను అవహేళన చేసేకాలం వస్తుందని నేను ఎన్నడూ భావించలేదు."

"నాన్నగారూ! నా ప్రవర్తనవల్ల మీరు అధికబాధను పొందినట్లున్నారు. కాని నేను ఏదిచేసినా నా ఆత్మప్రేరణ వల్లనే చేశాను. స్వామీ రామకృష్ణ పరమహంస పావన ఆదర్శ ఉపదేశాలు నన్ను విశేషంగా ఆకర్షించాయి. వివేకానంద బోధనలు నన్ను సత్యశోధనవైపు లాగాయి. అంతే, నేను సత్యాన్వేషణకై వెళ్ళాను."

"సత్యం ఏమిటో దొరికిందా నీకు? నువ్వు విద్యార్థివి, నీకు వివేకం ఉంది. విద్యార్థి కర్తవ్యం ఏమిటో చెప్పు సుభాస్—చదువుకోవడమా? సంసారిక సత్య విషయాన్వేషణమా?"

"విద్యార్జనం. కాని పాఠశాల విద్య వ్యక్తికి సంపూర్ణ జ్ఞానాన్ని ప్రసాదించలేదు. నా ఉద్దేశ్యంలో కేవలం పాఠశాల విద్యతోనే వ్యక్తి సఫలత పొందలేడు."

"మాసాల తరబడి అడవుల్లో తిరిగి నువ్వు తెలుసుకున్న సత్యం ఇదేనా?"

"సత్యం తెలుసుకోవడంకోసం నేను చాల దూర ప్రదేశాల్లోనే తిరిగాను నిజానికి అది వనాల్లో, కొండ గుహల్లో, మఠాల్లో లేదు. అది ఈ ప్రపంచంలోనే జనసమూహంలోనే ప్రతిచోటా వుంది. దాన్ని మనం జనంలోనే వెదకాలి అని తెల్సుకున్నాను."

"నీ ఉద్దేశ్యం మహబాగా తెలిసిపోయింది సుభాస్. ఇంతకూ నువ్వు ఏం చేయాలనుకుంటున్నావ్? ఏదయినా ఓ ఆదర్శాన్ని సాధించడంకోసం అందుకు తగిన యోగ్యత సంపాదించుకోవడం అవసరం. మొదట సంపూర్ణ ధ్యాసతో నీ చదువు పూర్తిచేసుకో. తర్వాత నీ ఆదర్శానికి తగిన మార్గంలో వెళ్ళవచ్చు"

"అలాగే చేస్తాను"

తండ్రి ఆదేశానికి తలవంచాడు తనయుడు.

తల్లి ఏడుస్తూ ప్రేమతో కొడుకును కౌగిట చేర్చుకుంది.

ఆ మాతృమూర్తి అప్యాయతకు చలించిపోయాడు సుభాస్,

"కొన్నిరోజులు అలా తిరగాలనిపించి వెళ్ళాను. తిరిగి నీ చల్లని ఒడి జ్ఞాపకం వచ్చి పరుగెత్తుకొచ్చాను. ఇంతమాత్రానికే ఇలా ఏడిస్తే ఎలాగమ్మా. నీ

సుభాస్ ఈ వంశ గౌరవానికి భంగకరంగా వుండే ఏ చెడుపనీ చేయదని విశ్వాస ముంచు. నీ పవిత్రగర్భంలో జన్మించినవాడిని. నీ అమృతంవంటి పాలుత్రాగి పెరిగినవాడిని. నీకెలా కష్టాన్ని కలిగిస్తాను చెప్పు"

ఇంకా దేశంకోసం, ప్రజలకోసం తన హృదయం ఎంతగా వ్యధ చెందుతున్నదో వివరించాడు.

ఆ తల్లి తన కొడుకు ఆదర్శచింతనకు ఆనందబాష్పాలు రాల్చింది.

## ఉత్తమ విద్యార్థిగా

ప్రతిభను యెంత దాచినా దాగదు. ఏదో రూపంలో అది బయట పడు తూనే వుంటుంది. సుభాస్ తిరిగి చదువులో చక్కగా లీనమైనాడు. తన ఆదర్శాన్ని మాత్రం మరచిపోలేదు.

వివేకానందుని స్ఫూర్తి ఆయనలో ప్రవేశించింది. తోటి విద్యార్థులకు గంభీరంగా కన్పించేవాడు.

బోసుబాబుకు అన్నివిధాలా యోగ్యుడయిన మిత్రుడు దిలీప్‌కుమార్ రాయ్. వారి స్నేహం దిన దిన ప్రవర్ధమానమైంది.

కాలేజీలో ప్రతిభాశాలురయిన భారతీయ విద్యార్థుల ఉపన్యాస సంస్థను ఏర్పాటుచేశాడు బోసు. దిలీప్‌ను పిల్చినప్పుడిలా అన్నాడు. "ఉపన్యాసాలా! రామ కృష్ణ పరమహంస అభిప్రాయం ప్రకారం ఉపన్యాసాలు (విషయ చర్చలు)సత్యం నుంచి మన మనస్సుల ప్రక్కకు తొలగిస్తాయి" అంటే సత్యం కంటే విశ్వాసం గొప్పది అనే భావం రామకృష్ణది అనుకోవాలి క్రీస్తువలెనే.

అందుకు సుభాశ్చంద్రుని జవాబిది-

"ఆ విచారం అక్కర్లేదు. నా ఉద్దేశ్యంలో ఉపన్యాస చర్చలు మన ప్రతిభావికాసానికి తోడ్పడుతాయి. దేశ క్షేమంకోసం ప్రస్తుతం వీటి అవసరం ఎంతయినా వుంది.

మనం ప్రతి విషయంలో పూర్వ కవుల-సాధువుల వాక్యాలు మాత్రమే ఉదహరించడం మానేయాలి. ఈ సూక్తులే హిందూ సమాజాన్ని. సంస్కృతిని సంకుచితపరిచాయి. మన భవిష్యత్ సమాజ నిర్మాణం కోసం పాతపునాదిపై కొత్త గోడలను నిలబెట్టుకోవాలి. మన జన్మం దేశ సేవకోసమే వచ్చింది. మనం పురాతనపు మాటలను వదలి నవీన వాక్కులను సొంతం చేసుకోవాలి. నేను రామకృష్ణ పరమహంస ఆలోచనలను అంగీకరించను. కాని అంతకంటే స్వామీ వివేకానంద సిద్ధాంతాలు ఆచరణీయాలు."

ఆ మాటలనుకాదనలేకపోయాడు దిలీప్‌కుమార్. మరో రీతిగా తప్పుకో జూశాడు.

"కాని-నేను చక్కగా ఉపన్యసించలేను. స్టేజీపైకి వస్తేనే నాకు సిగ్గు ముంచుకొస్తుంది"

"ఇది ఒక మేధావియైన విద్యార్థి, భారత నవయువకుడు పలకవలసిన మాటేనా? ఆరంభంలో ప్రతి వ్యక్తికీ అలాగే సంకోచం వుంటుంది. కాని అభ్యాసం వల్ల అలవాటైపోతుంది."

ఇది ప్రతి విద్యార్థీ ఆలోచించదగిన అంశం. విద్యార్జనతోపాటు ఇలా

యువ మిత్రులకు విజ్ఞానాన్ని పంచుతూ, ధైర్యాన్ని పెంచుతూ బోసుబాబు రాబోయే భారత విముక్తి విప్లవపోరాటానికి ముందే వేదికను సిద్ధంచేసుకోసాగాడు.

## అధ్యాపకుని దుడుసుతనానికి గడుసు జవాబు

ఒకనాడు ఇంగ్లీషు ప్రొఫెసర్ మిస్టర్ ఓటంగ్ క్లాసులో పాఠంచెపుతూ ఒక భారత విద్యార్థిని ఏదో ప్రశ్న అడిగాడు.

అతడు జవాబు ఇవ్వలేకపోయాడు.

"యూ బ్లాక్ మంకీ ఏం చదువుతున్నావ్?" అన్నాడు కోపంతో మిస్టర్ ఓటంగ్. ఆ విద్యార్థి స్తబ్ధుడై మౌనంగా నిలిచివున్నాడు.

"మీ నాలుకను అదుపులో వుంచుకోండి సర్" వేగంగా లేచి ఉద్రేకముగా అన్నాడు సుభాస్.

"యూ సిట్ డౌన్" అరచాడు ప్రొఫెసర్.

"మీరు ఇతడ్ని నల్లకోతి అని ఎందుకన్నారు?"

"మధ్యలో నువ్వెందుకు మాట్లాడతావ్. యూ డ్యాం బ్లడీ..." కోపముతో అన్నాడు ఓటంగ్.

"యూ డ్యాం బ్లడీ వైట్ మంకీ" ఉగ్రుడై తిట్లవర్షం కురిపించాడు సుభాస్. పైగా ప్రొఫెసర్‌గారి చెంపపై ఛెళ్లుమని ఒక చరుపు చరిచాడు.

అధ్యాపకుడు ఖిన్నుడై నిలిచాడు నల్లబడిన చెక్కిలిని చేత్తో పుణుకుకొంటూ తరగతి నిశ్శబ్దమైంది.

అంతటితో వదల్లేదు సుభాస్. కాలేజీ పిల్లలతో సమ్మె చేయించాడు ప్రొఫెసర్‌పై క్రమశిక్షణ చర్య తీసుకోవాలంటూ చాటుకు ఎంత గ్రంథం నడిచిందో కాని దాని ఫలితంగా బోసుబాబును కాలేజీనుంచి బహిష్కరించారు.

బాధపడలేదు. ఇంటికి వెళ్లాడు. తండ్రి చీవాట్లు తప్పలేదు.ఆంగ్లేయులు భారతీయులను అవమానపరచడం సహించలేను-అన్నాడు బోసుబాబు తండ్రితో.

కొడుకు ప్రవర్తన యువక ఆవేశం తప్ప మరే ప్రత్యేకతలేనిది,పనికిరానిది-అని తండ్రి అనుకున్నాడు.

ఎలాగో ఆ రెండు సంవత్సరాలు గడిపి తండ్రి పట్టుదలవల్ల తిరిగి అదే కాలేజీలో చేరి బి.ఎ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు 1919లో.

## ఐ. సి. ఎస్. కోసం విదేశాలకు వెళ్ళాడు

సుభాస్ ఎం.ఎ. చదవాలనుకున్నాడు. తండ్రికది ఇష్టంగాలేదు. తల్లికి కొడుకు కోరికనే మన్నించాలని వుంది. తండ్రి అంగీకరించలేదు.

ప్రభావతి కొడుకును ఒక అవతారపురుషుడుగా భావించి కలలుకనేది. అతనిని మిగతా తన పిల్లలందరికంటే ప్రేమగా చూసేది. అతడి ప్రత్యేక ప్రవర్తన, అపారమయిన కరుణ, దీనజనసేవ, నిరాడంబరత్వం ఆమెను విశేషంగా ఆకట్టుకొన్నాయి.

రాయబహద్దూర్ గౌరవంగా, ఆడంబరంగా జీవించాలనుకునే వ్యక్తి. ఆంగ్లేయుల సంసర్గంలో మెదిలేవాడు. సంఘ సంస్కారం అనే సున్నిత భావాలకు

లోనయ్యేవాడు కాదు. తన విషయాలు, సుఖాలు తాను చూసుకునే రకం, కాబట్టి పుత్రుని వైఖరి, అంతకుమిక్కిలి తన భార్య అతని పక్షం మాట్లాడటం ఒప్పుకోలేకపోయాడు.

బోసు దారితప్పి తన కుటుంబ గౌరవాన్ని భంగపరిచే ప్రయత్నంలో ఉన్నాడని భావించాడు. జన్మస్థానం-వారసత్వ లక్షణాలేకాక పరిసరాల ప్రభావాలూ వ్యక్తులపై ప్రభావం చూపుతాయి. కాబట్టి కొడుకును యీ వాతావరణం నుంచి తప్పించాలనుకున్నాడు.

ఐ. సి. ఎస్. కోసం లండన్ పంపించాలని నిర్ణయం తీసుకున్నాడు. అబ్బాయి ఉద్దేశ్యానికి భిన్నంగా భర్త నిర్ణయం వుండటం ఆ తల్లికి బాధవేసింది. భర్తకు యెదురాడినా వినకపోయేసరికి నిస్సహాయంగా కన్నీరు కార్చింది

విచారించకమ్మా-అని తల్లిని ఓదార్చాడు బోసు.

తనకు ఐ.సి.ఎస్. చదువాలని లేదని, విదేశీ ప్రభుత్వానికి లోబడి బానిసగా ఉద్యోగం చేయాలని లేదని, స్వతంత్రంగా వుంటూ దేశసేవ చేయాలని వుందని, బోసు తండ్రికి స్పష్టంగా చెప్పేశాడు.

అదే వద్దని తండ్రి తలంపు. కొడుకు ప్రతిభపై విశ్వాసం వుంది. నయాన్నో భయాన్నో తనదారికి తెచ్చుకోవాలనేదే ఆయన ఆరాటం. మొక్కయి వంగనిది మ్రానై వంగదని విశ్వాసం. అందుకే ఈ ఎత్తు వేశాడు.

"ఐ. సి. ఎస్. చదవాలని లేదని అంటావెందుకు? దాన్ని ప్యాసయ్యే యోగ్యత నీకు లేదని చెప్పితే సరిపోతుంది కదా" కొడుకు అభిమానంపై దెబ్బ

కొట్టాడు. తన ఆదర్శాన్ని చేతకానితనం క్రింద జమచేసేసరికి బాధపడిపోయాడు బోసుబాబు.

"నేను మీ కోరిక పూర్తిచేస్తాను" అన్నాడు.

తండ్రి ఆనందించాడు. తల్లి విచారించింది భర్త - కొడుకు ఇద్దరి అభిప్రాయభేదాల మధ్య ఆమె నలిగిపోతున్నది. స్త్రీలకు ఎంతటి సదాలోచన సత్సంకల్పం వున్నా, ఈ పురుష స్వామ్య సమాజంలో భర్తకు లోబడి ఆశయాలు దిగమింగుకొని మెదలవల్సి వుంటుంది కదా! ఈ సంభాషణ జరిగిన వారం రోజుల్లోనే బోసుబాబు లండన్ పయనమయ్యాడు.

## లండన్ లో

ఇంగ్లాండుచేరి లండన్ ప్రెసిడెన్సీ కాలేజీలో చేరుకున్నాడు. తన మిత్రుడు దిలీప్‌కుమార్‌రాయ్ అంతవరకే అక్కడ చదువుకుంటున్నాడు. మిత్రుని రాక అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఇదేమిటి?" అని అడిగాడు. విదేశాల్లో చదవాలని లేదనే సుభాసు మాటలు అప్పుడప్పుడు కలకత్తాలో విన్నాడు కనుక.

"నాన్నగారి కోరికను పూర్తిచేయటానికే నేనీ చదువుకోసం వచ్చాను. నా సంకల్పం నాలో దృఢంగానే వుంది" అన్నాడు.

అప్పుడు ఆ మాటలు సరిగా అర్థం కాకున్నా ఆ తర్వాత ఆ విషయం స్పష్టంగా అర్థమయింది. ఐ.సి.ఎస్. (ఇండియన్ సివిల్ సర్వీసెస్) ప్యాసయ్యి

ఆ పట్టాకు టోకరా ఇచ్చినప్పుడు, సుభాస్ బంధుమిత్రులేకాదు మొత్తం దేశమే అచ్చెరువు పాలయ్యింది. ఆయన ఎంతటి స్థిరసంకల్పం కలవాడో, ఎంతటి సిద్ధ పురుషుడో తెలిసింది.

కేవలం ఎనిమిదిమాసాల పరిశ్రమతోనే 1920లో ఆ పరీక్షలో బోసు బాబు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. వ్యాసరచనలోనయితే ఫస్టిన్ ఫస్టు మాత్రమేకాక క్రొత్త రికార్డు నెలకొల్పాడు.

తండ్రి ఎత్తిపొడుపుకు తాను జవాబు ఇచ్చాడు. తనలో అసమర్థత లేదని సాక్ష్యం చూపించడానికి అది సాధించితీరాడు. ఇక తన సమర్థత-తన జీవిత లక్ష్యం నిరూపించుకోవాలనుకున్నాడు.

"నేను ఒక విదేశీ ప్రభుత్వానికి లోబడి వుద్యోగం చేయలేను" అని అప్పటి భారత బ్రిటిష్ ప్రధాని లార్డ్‌లింటన్‌కు లేఖ వ్రాశాడు. ఈ ప్రకటనతో బ్రిటిష్ ప్రభుత్వాధికారుల్లో సంచలనం కలిగింది. సుభాస్‌ను పిలిపించి పదవీ త్యాగానికిగల కారణాలను ప్రశ్నించారు. అందుకు బోసు యిలా దృఢంగా అన్నాడు.

"నా ఉద్దేశ్యం ప్రకారం దేశసేవలో ప్రవేశించే వ్యక్తి మీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని సమర్థించలేడు. నేను పరిపూర్ణంగా నా మాతృదేశసేవ చేయాలని సంకల్పించుకున్నాను. అందుకే ఆంగ్ల ప్రభుత్వానికి లోబడి అధికారం నిర్వహించడం నావల్ల కానిపని."

ఈ అద్భుత సంఘటన యిటు బెంగాళ్—ఇండియాలోనూ, అటు బ్రిటన్‌లోనూ సంచలన వార్త అయి చాల వ్యాప్తిపొందింది.

# స్వదేశానికి రాక

కనకొడుకు విదేశాల్లో చదువుకున్నాడంటే ఎంతో గొప్ప ఆ దినాల్లో. అదీ ఐ.సి.ఎస్. అధికారి కావడం మరింత గర్వకారణం. జానకీనాథ్ తన కుమారుడు ఆ పరీక్షల్లో ఉత్తీర్ణుడయినందుకు యెంతగా ఆనందించాడో ఆ పదవీ త్యాగం చేసినందుకు రెట్టింపు విచారానికి లోనయ్యాడు.

సుభాష్ ఎవరి ఇష్టాయిష్టాలకో తన ధ్యేయాన్ని వదలుకో దలుచుకో లేదు.

"నువ్వు బాగానే చేసి వుండవచ్చుగాని, నీ చర్యవల్ల నాన్నగారికి రాత్రుళ్ళు నిద్ర కరువయింది. వారు నీ విషయంలో చాల చింతతో వున్నారు. నీ పని మాకు కష్టంగా వుంది" అని బోసుబాబు సోదరుడు వ్రాశాడు.

అది సుభాసు మనస్సులో ఆలోచన సుడిగుండాల్ని లేపింది.

అయినా చివరికి యిలా నిర్ణయం చేసుకున్నాడు.

"మనిషి జీవితంలో సమాజ సంక్షేమం కోసం పూనుకుంటే అతడు తన ప్రతి సుఖాన్ని వదలుకోవల్సిన సమయం ఆసన్నమవుతుంది.

కుటుంబ వారసత్వాన్ని నిలబెట్టడం కంటె దేశం కోసం శ్రమించడం గొప్ప పని. నిజాన్ని ఆలోచిస్తే నేను కుటుంబ సంబంధంలో నాబాధ్యత నిర్వర్తించాను. దేశం కొరకు నా కర్తవ్యాన్ని నిర్వహించవల్సి వుంది" అదీ అతని నిర్ణయం.



అయితే తన వ్యవహారం నచ్చని తండ్రి, ఖర్చుకోసం తనకు డబ్బు పంపించకపోతే తిరిగి స్వదేశం వెళ్ళడం ఎలా? అనే దిగులుపట్టుకుంది. ఆ విషయం తెల్సి దిలీప్‌కుమార్ రాయ్ "ఆ విచారం వదిలెయ్యి. నేనింకా జీవించే ఉన్నాను." అన్నాడు. అదీ నిజమైన మైత్రి!

## రాజకీయ రంగంలో

ఆ కాలంలో దేశబంధు చిత్తరంజన్‌దాసు హెచ్చరిక బోసును ఆకట్టుకొంది.

చిత్తరంజన్ 1914 అరవిందఘోష్ ఆలీఘడ్ కుట్ర కేసులో ప్రతిభావంతంగా వాదించి గెలిచిన లాయర్. కలకత్తా నివాసి. అతివాద కాంగ్రెసు నాయకుడు. ఆయన ప్రబోధమిది.

"నవ యువకులే దేశానికి ప్రాణం. దేశ స్వాతంత్ర్య సంగ్రామం వారి పవిత్ర త్యాగంపై ఆధారపడి వుంది. యువజనుల సంఘటితశక్తి యీమహా యజ్ఞాన్ని సంపూర్ణంగా నిర్వహిస్తుంది."

స్వాతంత్ర్య పోరాటదీక్షతో క్రాంతివీరుడు బోసు స్వదేశానికి పయనం కట్టాడు.

1919 జలియన్‌వాలాబాగ్‌లో ఆంగ్లేయులు జరిపిన బీభత్స మారణకాండనుగూర్చి విన్నాడు. దేశ పరిస్థితులు కన్నాడు. తెల్లవారల క్రూరత్వానికి బలయిపోతున్న దేశీయుల గురించి ఆయన మనస్సు ఆవేదన పొందింది.

మాంటెంగ్ చేమ్స్‌ఫర్డ్ సంస్కరణలవ్యతిరేకత దేశంలో కన్పించింది. కాంగ్రెసు యింకా సంపూర్ణ స్వరాజ్య నినాదం చేపట్టలేదు.

స్వరాజ్యం మా జన్మహక్కు అని గర్జించిన బాలగంగాధరతిలక్ జైలుపాలయ్యాడు–1920లో ఆయన మరణించాడు.

గాంధీ కాంగ్రెసులో ప్రముఖపాత్ర వహిస్తున్నాడు దేశబంధు చిత్తరంజన్‌దాసు తన సర్వస్వాన్ని స్వాతంత్ర్య ఉద్యమం కోసం త్యాగం చేసిన మహోదారుడు.

16 జులై 1921లో సుభాస్ భారతదేశానికి వచ్చాడు.

అప్పటి గాంధీజీ కాంగ్రెసు సహాయ నిరాకరణ సత్యాగ్రహ ఉద్యమాల్లో చేరాడు బోసు.

భారత మహాయుద్ధంలో అర్జునునకు శ్రీకృష్ణుడు మార్గదర్శకుడయి తోడు నిలిచినట్లు, సుభాశ్చంద్రునకు భారత స్వాతంత్ర్యపోరాటంలో చిత్తరంజన్ దాసు సహకారం లభించింది. తన ఆశయసాధనకు అన్నివిధాలా తగిన యోగ్యత బోసుబాబులో కన్పించి చిత్తరంజన్ చేరదీశాడు.

ఆయన అంచనా తప్పుకాలేదని తర్వాతి చరిత్ర నిరూపించింది.

## కార్య నిర్వాహకత్వంలో

దేశబంధు నెలకొల్పిన బెంగాళ్ జాతీయ విద్యాలయంలో బోసుబాబు ప్రిన్సిపాల్‌గా పదవీ బాధ్యత స్వీకరించాడు. ఆ పని చక్కగా నిర్వహించాడు.

కాంగ్రెసు వాలంటీర్ల దళాన్ని దాసు తయారుచేసినప్పుడు దాని నిర్వహణ ఆధిపత్యం బోసుబాబుకే ఒప్పగించబడింది. ఆ స్వయంసేవక దళానికి సేనాధిపతిగా ఆయన మహత్తర బాధ్యతను నిర్వహించాడు.

ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఇండియా సందర్శనకు వచ్చినప్పుడు భారతీయు లెందరో స్వాగతం పలికారు. విశ్వకవి రవీంద్రుడు రచించిన యిప్పటి మన "జనగణమన" జాతీయగీతం, అప్పుడు ఆంగ్ల రాజకుమారునికి వ్రాసిన స్వాగత గేయమంటారు.

చిత్తరంజన్ బ్రిటిష్ రాకుమారుని రాకను వ్యతిరేకించాడు.

రాజకుమారుని అగమనానికి నిరసనగా వేలాది యువకులతో గొప్ప ప్రదర్శన నిర్వహించాడు సుభాశ్చంద్రబోసు. అదే సందర్భంలో భారత ఆంగ్ల ప్రభుత్వం బోసుబాబును బంధించి ఆరునెలలు జైలు శిక్ష విధించింది-10 డిశంబర్ 1921.

## జైలులో

ఆరుమాసాల కాలం అలీపూర్ జైల్లో గడిపాడు సుభాస్.

బందిఖానానే ఒక పాఠశాలగా భావించాడు. కొత్తమిత్రులతో పరిచ యాలు కొత్త అనుభవాలు ఆయనకు సరికొత్త స్ఫూర్తిని కర్తవ్యనిష్టను ప్రబో ధించాయి.

అహ్మదాబాద్ కాంగ్రెసు సభలకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడడానికి కొన్నిరోజులకు ముందు దేశబంధు బందీ కావించబడి అదే జైలుకు పంప బడ్డాడు.

గురువును చూసిన శిష్యుని ఆనందానికి అంతులేదు. ఇద్దరూ యెన్నో విషయాల గూర్చి సమాలోచనలు జరుపుకున్నారు.



"జైల్లో కూడా లభించిన మీ సాహచర్యాన్ని నా భాగ్యంగా భావిస్తున్నాను"-బోసుబాబు ఆనందంలో తానూ భాగం పంచుకొంటూ ఇలా అన్నాడు సి. ఆర్. దాస్,

"నిజానికి స్వతంత్రపోరాట యజ్ఞంలో ఆహుతి అర్పించడానికి మనమిద్దరం సమాన భాగస్వాములం. సేవా త్యాగాల్లో మనలో ఎలాంటి భేదభావంలేదు. ఈ కఠోర త్యాగాల్లో మనలో ఎలాంటి భేదభావంలేదు. ఈ కఠోర జైలు యాత్ర

అనుభవం వల్ల మనం ముందు నడవ వలసిన కార్యక్రమానికి బలమైన స్ఫూర్తిని పొందాలి. ఈ కష్టాలు మన కర్తవ్య నిష్టను పెంపొందించుతాయి."

చిత్తరంజన దాసుకు రాజకీయ ఖైదీగా మొదటి శ్రేణి సౌకర్యాలు లభించాయి అయినా ఆయన జైలులోనికి మిత్రులను పిలిపించుకొని రాజకీయ చర్చలు కావించేవాడు. అదొకరీతిగా వారికి రాజనీతి శిక్షణాలమయుమయింది.

"నా చిరకాల వాంఛను పూర్తిచేసే వ్యక్తివి నువ్వనే విశ్వాసం నాకుంది" అన్నాడో దినం సుభాసుతో దేశబంధు.

మౌనంగా విన్నాడు బోసు. రాజకీయాల చర్చసాగింది.

"నేను నీ నుంచి రాజనీతి శిక్ష పొందాలను కుంటున్నాను."

"మార్గదర్శికి ప్రయాణీకుడు ఏం చెప్పగలడు" చిత్తరంజన్ ప్రశ్నకు బోసు ఇచ్చిన జవాబు.

"చెప్పవచ్చును. సిద్ధాంత ఆలోచనా పరుసికంటె ఆచరణ శీలి సర్వథా గొప్పవాడు. నీవలాంటి వాడివి."

"ఏ విషయాన్ని గానీ సిద్ధాంతపరంగా అధ్యయనం చెయ్యడమే క్రియా శీలతకు ముఖ్యం."

బోసు మాటకు గంభీరంగా నవ్వి "సుభాష్! నేను నీ గాఢమైన సిద్ధాంత పరిజ్ఞానంతో ప్రయోజనం పొందాలను కుంటున్నాను" అన్నాడు చిత్తరంజన్.

అప్పుడిక శ్రద్ధగా రాజనీతి శాస్త్రం అధ్యయనం చేశాడు బోసు. తీపి చేదు అనుభవాలతో ఆ జైలు జీవితం గడిచిపోయింది. దేశబంధు బోసుబాబుకు

కేవలం మార్గదర్శి మాత్రమే కాదు మంచి మిత్రుడు కూడాను. ఆయన ప్రముఖ ఆదర్శ వ్యక్తి. దేశభక్తులను తన మిత్రులుగా భావించి స్వాతంత్ర్య పోరాట దీక్షలో స్థిరం కావించే క్రియాశీలి, బంధుమిత్రులనుండి గంపల కొలది వచ్చే మిఠాయిలను పండ్లను సహచరులకు జైలులో పంచి ఆనందించేవాడు.

మహనీయులకు విశ్వమే కుటుంబం.

## ఇంటిలో పాత కథే

ఆరుమాసాలు జైలులో గడిపి విడుదల పొంది వచ్చిన తర్వాత అందరి కంటె మిన్నగా ఆనందించిన దెవరు? ప్రభావతి! మిత్రులు సరేసరి, తండ్రి ధోరణి యెప్పటి మాదిరిగానే ఉంది. ఇప్పుడు కొత్తగా ఎలా మారుతుంది.

"బాగున్నారా అమ్మా!" బోసు మొదటి ప్రశ్న తల్లితో.

"ఆరే సుభాస్! మా బాగుకంటె ఎక్కువగా నీ ఆరోగ్యం కోసం దిగులు పట్టుకుంది మా కిప్పుడు. ఎందుకంటె ఇప్పుడు నువ్వు కేవలం మా బోసు వేనా? ఈ సమస్త దేశరక్షణ కోసం నడుం బిగించి నిలిచిన వాడివి. శరత్, సునీల్ నీ తోబుట్టువులు ఇంకా నీ తండ్రి అందరూ నీ క్షేమం కోసం ఆదుర్దా పడు తున్నారు"—అని ఆనందంతో కొడుకు వచ్చిన వార్త ఇంట్లో వాళ్ళకు తెలుప డానికి లోపలికి వెళ్ళింది.

రాయబహద్దూర్ ఆలోచనలు వేరుగా ఉన్నాయ్.

ఈ అబ్బాయి ప్రవర్తన తనకేమీ తెలియరానిదిగా ఉంది. ఆంగ్లేయ ప్రభుత్వ వ్యతిరేకత విషయంలో తన పాత్ర ఏమీ లేదు. నేటి నవయువకుల

ఆందోళన జైళ్ళలో బంధింపబడడం వరకు పని చేస్తున్నది. వీళ్ళ తిరుగుబాటు నినాదాలు తోపు (పిరంగి) ధ్వనులవలె కొంత కాలం మాత్రమే వినవచ్చేవి. దీని వల్ల సుభాస్ భవిష్యత్తు అంధకారమయంగా కన్పిస్తున్నది. అయినా అతని మనో ప్రవృత్తికి భిన్నంగా అనవసరంగా పెత్తనం చెలాయిస్తూ చివరికి తానే ఓడిపోయి నట్లుగా అనిపించింది. తాను రాజకీయ సంస్థలకు దూరంగా ఉన్నాడు. ఈ స్వతంత్ర పోరాటంలో భారతీయులు చివరికి తమ సర్వస్వం కోల్పోక తప్పదు. వ్యక్తితో వ్యక్తి పోరాటం సంభవం కాని, వ్యక్తితో ప్రభుత్వపోరాటం సాధ్యం కాదు. ఈ పరిస్థితిలో కొడుకునకింకా తాను చెప్పేదేమీ లేదు. తన చర్యలకు తానే బాధ్యుడు.

ఇలా ఆలోచించే రాయబహద్దూర్‌కు తన కుమారుడు జైలునుంచి విడుదల పొంది ఇంటికి తిరిగి వచ్చిన విషయం ఆనందంగా లేదు-విషాదంగానూ లేదు. భర్త మాటలు విన్న ప్రభావతి మౌనంగా ఒక్క నిట్టూర్పు విడిచింది.

# ప్రజాసేవకై పలాయనం

అక్కడ ఆనాడు వార్తా పత్రికలు చూస్తున్న సుభాస్‌కు ఉత్తర బెంగాల్‌లో తీవ్రమైన వరదలు (1922) లక్షల కొలది ప్రజలు తమ ఇళ్ళు పశువుల సంపదలు కోల్పోయి నిరాశ్రయులయ్యారు—అనే వార్త ఆకర్షించింది. అంతతీవ్రమైన ప్రమాదం అంతకు ముందెన్నడూ కన్నది విన్నదీ కాదు.

అకస్మిక విపత్తుల్లో మానవ జీవితాలు దుఃఖంలో మునిగి పోయినప్పుడు వారిని ఆదుకునే మార్గం కోసం ఆలోచించసాగాడు. అది తనవంటి వారి విధిగా ఎంచాడు.

జైలునుంచి వచ్చిన రోజే తల్లి అనుమతి తీసుకొని వరద బాధితుల సహాయం కోసం బయల్దేరాడు. విషయం విని మృదుల మిత్రుని అనుసరించింది.

తనవంటి ఉత్సాహ పరులతో ఒక సేవాసంఘాన్ని ఏర్పాటు చేశాడు. ఉదారుల సహాయాన్ని అర్థించాడు. ఆ కార్యక్రమానికి తానే స్వయంగా నాయకత్వం వహించాడు.

ఆ భయంకర ఆపత్సహాయంగా వరదల్లో చిక్కుకుపోయిన వారిని సురక్షిత స్థానాలకు తరలించడానికి, వారికి భోజన భాజన ఔషధాది సౌకర్యాలు అందించడానికి, పునరావాస సదుపాయాలు సమకూర్చడానికి ఒక్క వ్యక్తి వేయి మంది శక్తితో పరిశ్రమించాడు.

బోసుబాబు పని తీరు సౌజన్యం కరుణ నిరాండంబరత్వం చూస్తే ఆయన ఒక ఉన్నత స్థాయి న్యాయవాది కుమారుడని భావించడానికి వీలుండేది కాదు. మృదులస్థితీ అలాగే ఉంది. ఒక ఉన్నత పోలీసు అధికారి కూతురుననే భావం మరచి సామాన్య ప్రజాసేవికగా మిత్రుని దీనజన సహాయ కార్యక్రమాల్లో భాగం పంచుకుంది.

## స్వరాజ్య పార్టీ నిర్మాణం—1923

"బ్రిటిష్ ప్రభుత్వాన్ని స్వాధీన పరచుకోవడానికి మనం వారి స్థావరం లోకి బలంగా చొచ్చుకుపోయి పోరాటం చేయాలని నా అభిప్రాయం. అందు కోసం మనం అసెంబ్లీలో ప్రవేశించి ఆంగ్లేయులను వారి రాజ్యాంగ సూత్రాల ద్వారానే అంతం చేయాలి" అన్నాడు చిత్తరంజనదాస్.

"నేను ఈ విషయంలో మిమ్ము పూర్తిగా సమర్థిస్తున్నాను. శత్రువుల నుంచి విజయం పొందడానికి మనం మనం ఆలోచనల కార్యక్రమాలకు వెంటనే కార్యరూపం తేవాలి" అని బలపరచాడు సుభాసు.

గయా కాంగ్రెసు సభల్లో దేశబంధు కాంగ్రెసు నాయకులతో తీవ్రంగా విభేదించాడు. తన వంటి తీవ్రవాద భావాలతో వారితో కలిసి విడిపోయాడు. కాంగ్రెసు మొదటిసారిగా రెండు ముక్కలయింది. నిజానికది తిలకుతోనే విడి పోయింది. భావపరంగా యిప్పుడు పార్టీపరంగా విడిపోయింది. మితవాద కాంగ్రెసు వారిదే పెద్ద సంఖ్య అయినా చిత్తరంజన్ విచారించలేదు.

1921లో గాంధీ నాయకత్వంలో నడిచి అసహాయ ఉద్యమం, 1922లో ఉచ్ఛస్థాయికి చేరిన పోరాటాన్ని ఆయన అహింస పేరుతో నిలిపివేసిం తర్వాత.

భగత్‌సింగ్, ఆజాద్ చంద్రశేఖర్, యశపాల్, అల్లూరిశీతారామరాజు వంటి వాళ్ళు సాయుధపోరాట పంథాను అనుసరించారు. సి.ఆర్.దాసు, విఠల్‌బాయి పటేల్, మోతీలాల్‌నెహ్రూ, లాలాలజపతిరాయ్ మొదలయినవాళ్ళు అతివాద కాంగ్రెసువాళ్ళుగా చీలిపోయారు.

సి.ఆర్.దాసు "స్వరాజ్య" పార్టీని యేర్పాటు చేశారు 1923. సుభాస్ స్వరాజ్యపార్టీని బలపరచడమేకాక అందులో చేరిపోయాడు. ఎవరు విమర్శించినా లెక్కచేయలేదు.

## ఫార్వర్డ్ పత్రిక నడిపాడు

స్వరాజ్యపార్టీ తరపున "ఫార్వర్డు" అనే పత్రికను స్థాపించాడు

సి.ఆర్.దాస్. దాని నిర్వహణ సంపాదకత్వ బాధ్యతను సుభాసుకే ఒప్పగించాడు. బోసు బహు చాకచక్యంతో ఆ దినపత్రికను నడిపించాడు.

అందులో దేశ స్థితిగతులతోపాటు, రాజకీయ చర్చలు ఉండేవి. ప్రజల. రాజకీయనాయకుల అభిప్రాయాలు చిత్తశుద్ధితో ప్రకటింపబడేవి. ఇంకానిర్భయంగా ప్రభుత్వ దుశ్చర్యలను విమర్శించేవాడు.

స్వరాజ్యపార్టీ ఆంగ్ల ప్రభుత్వ కౌన్సిల్లో చేరడాన్ని కాంగ్రెసు గట్టిగా ఎదిరించసాగింది. గాంధీజీ "యంగ్ ఇండియా" పత్రికలో వీరిని విమర్శించేవాడు దానికి జవాబుగా సుభాస్ ప్రతి విమర్శలు వ్రాసేవాడు.

బొంబాయి కాంగ్రెస్ సభలో గాంధీ మాటలలోనే ఆ పార్టీ నాయకులకు వాగ్బంధం కావించాడు బోసుబాబు.

కాంగ్రెసుతో చేరటానికి తటపటాయిస్తున్న అల్పసంఖ్యాక పార్టీలు స్వతంత్రంగా తమ స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించవచ్చునని గాంధీజీ అన్న మాటను గుర్తుచేశాడు. సెనేసి, ఎడ్యుకేషన్, బిల్లుల అమలుతో బెంగాలు రైతులు, దేశ విద్యావిదానం, ఎలా నష్టపోతున్నది వివరించి, తాము అసెంబ్లీలో ప్రవేశించి ఆంగ్ల ప్రభుత్వం విధించిన కఠినచట్టాల్ని వారి శాసనసభ ద్వారానే ఎదిరించదంచుకున్నామని స్పష్టంచేశాడు.అప్పటికింకా(1937 వరకు) కాంగ్రెస్ పెద్దలు శాసనసభలో ప్రవేశించమని మడికట్టుకొని కూర్చున్నారు. శాంతియుత పోరాటాలద్వారా స్వరాజ్యాన్ని సాధించాలనే సంకల్పం వారిది. అందుకే యీ విమర్శలన్నీను.

అయినా సుభాశ్చంద్రబోసు యొక్క న్యాయసమ్మతమైన వాదనలను కూడా కాంగ్రెసువాళ్ళు అన్యాయమైన విషయాలుగా, అనుభవంలేని పసిపిల్లల చేష్టలుగా భావించేవారు-హేళనచేసేవారు. అయినా బోసుబాబు దిగులు చెంద లేదు.

## కలకత్తా నగర కార్పోరేషన్ ఎన్నికల్లో స్వరాజ్య పార్టీ విజయం

కలకత్తానగర కార్పోరేషన్‌కు 1924లో ఎన్నికలు జరిగాయి.

స్వరాజ్యపార్టీ ఎన్నికల రంగంలో పోటీకి నిలిచి మొత్తం 75 సీట్లలో 55 సీట్లను గెలుచుకుంది. ఆ విషయాన్ని చూసి కాంగ్రెసువాళ్ళు నోళ్ళు తెరి చారు.

చిత్తరంజన్‌దాసు నగర మేయరుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు. ఆయన మేయర్‌గా చేసిన మొట్టమొదటి చెప్పుకోదగిన పని సుభాశ్చంద్రుని (ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్) శాసనాధికారిగా నియామకం చేయడం.

సుభాస్ కలకత్తా మహానగరాన్ని ఆదర్శపట్టణంగా రూపొందించడానికి బెంగాల్ ప్రభుత్వ అధికారి (గవర్నర్) లార్డు లింటన్‌పై ఒత్తిడితెచ్చాడు. అది నగర పరిషత్తులో స్వరాజ్యపార్టీ బలంగా వెలిగిపోతున్న కాలం.

అదే సందర్భంలో యెవరో ఒక ఆవేశపరుడయిన యువకుడు ఒక ఆంగ్లేయ అధికారిని చంపేశాడు. ఆంగ్లేయ ప్రభుత్వాన్ని ఒకసభలో నిందించాడు.



అది కారణంగా 80 మంది యువకులు క్రాంతికారులనే నెపంగా బంధింపబడ్డారు. అదే వరుసలో 1924 అక్టోబర్ 22 తేదీనాడు బోసుబాబుకూడా అరెస్టు చెయ్య బడ్డాడు. ఆ ప్రత్యేక ఆర్డినెన్స్ వెలువడిందే స్వరాజ్యపార్టీని దెబ్బతియ్యడానికి.

సుభాస్ అరెస్టుకు వాళ్ళపార్టీ మాత్రమేకాక మొత్తం దేశమే అలజడి చెందింది.

దేశబంధు చిత్తరంజన్‌దాసు చిత్తక్షోభ వర్ణించ అలవికానిది. మిత్రుడు బలమైనతోడు బంధింపబడడంతో తన కుడిభుజం విరిగిపోయినట్లు కావ డంతోపాటు, బ్రిటిష్‌వారి కూటనీతికి ఆయన బాధపడ్డాడు.

"మనం ప్రజల హింసాధోరణినే కాదు, ప్రభుత్వ దమన నీతినికూడా నిందించే కాలం వచ్చింది. ప్రభుత్వం న్యాయంకాని న్యాయచట్టాల్ని రూపొందిస్తున్నది. దాన్ని వ్యతిరేకించకపోతే నగర పౌరుల హత్యలు యధేచ్ఛగా జరిగిపోతాయి. అపరాధికి అతని దోషాన్నిగూర్చి తెలియజేయకయే ప్రభుత్వం అతనిని ఖైదుచేస్తున్నది-అంటే అది మానవహక్కులకు గొడ్డలి పెట్టు కాకపోతే మరేమిటి?

హింసలేనిదే ప్రజాపాలన సాగించలేని ఈ దేశప్రభుత్వం విషయంలో నాకు బాధగా ఉంది.

దేశప్రేమ ఉండడమే దోషమైతే నేనూ అపరాధినే. కలకత్తా నగర కార్పొరేషన్ శాసకుడు ఎంతటి దోషో నేనూ అంతటి దోషినే."

నన్నెందుకు బంధించరు? అని ఆవేదనతో ఆవేశంతో ప్రశ్నించాడు దేశబంధు సి.ఆర్.దాసు కార్పొరేషన్ సభలో.

## బందీ జీవనం

అలీపూర్ సెంట్రల్ జైల్లో కొన్నాళ్ళుంచి, తర్వాత బరంపురం జైలుకు మార్చి, ఆ తర్వాత బర్మాలోని మాండలే జైలుకు మార్చారు బోసు బాబును.

"బయటి ఆందోళన యే విధంగా సాగుతున్నదో? నా మిత్రులు నన్ను జ్ఞాపకమయినా చేసుకుంటున్నారోలేదో-ఈ సమయం నాలుగుగోడల మధ్య బందీగా

వృధాగాపడి వుండవల్సిందికాదు. ఈ అమూల్య సమయం నాకు స్వాతంత్ర్య పోరాటయజ్ఞంలో ఆహుతి కావల్సి నట్టిది" అనుకునేవాడు.

## ఆరోగ్యం వికటించింది

అక్కడి భయంకరమయిన ఎండలకు, విషపూరితమైన సముద్రపు గాలులకు బోసు ఆరోగ్యం దెబ్బతిన్నది.

తన ఆదర్శనేత 'దేశబంధు' చిత్తరంజన్‌దాసు 1925లో మరణించడం మరింత కుంగదీసింది. 40 పౌనుల బరువు కోల్పోయాడంటే సుభాసు శరీరం యెంతగా క్షీణించిందో తెలుసుకోవచ్చు. టి. బి. చేరింది. ఆ వార్త యిండియాలో వ్యాపించింది.

ఆజాద్ చంద్రశేఖర్, రాంప్రసాద్‌బిస్మిల్, అష్‌పాకుల్లా, రాజేంద్ర లాహిరి, రోషన్‌సింగ్ తదితర క్రాంతికారులు "కాకోరీ" రైలు దోపిడీ జరిపింది అదే సంవత్సరంలో.

బోసుబాబును వదలివేయాలంటూ దేశమంతటా సమ్మెలు జరిగాయి. శాసనసభలో విమర్శలు కురిశాయి. సుభాసును వదల్లేదు కాని ఆయన ఆరోగ్య పరిశీలనకోసం బోసు అన్న డాక్టర్ సుశీల చంద్రబోసు అధ్యక్షతలో ఒక కమిటీని యేర్పాటు చేసింది ప్రభుత్వం. ఆ కమిటీ ఆయనను వెంటనే వైద్యం కోసం హాస్పిటల్‌లో చేర్చాలని సిఫారసు చేసింది. ఆ సూచనను అధికారులు లెక్క చేయలేదు.

వంగశాసనసభ ప్రభుత్వంపై తిరగబడింది. ప్రభుత్వం బెదిరిందికాని తన పద్ధతి మార్చుకోలేదు.

అన్నంకాదు బువ్వ, అన్నట్లు ఆంగ్లప్రభుత్వం అదో కొత్త తీర్మానం చేసింది. బోసును వదులుతాంకాని, ఆయన భారతదేశంలో అడుగుపెట్టకూడదు. మాండలే (బర్మా) నుంచి ఇటుగా రంగూన్ వెళ్ళి విదేశాలకుపోయి చికిత్స చేయించుకోవచ్చును. ఖర్చులు తానే భరించుకోవాలి అంది.

ఈ అవమానకరమయిన నిబంధనను అంగీకరించడంకంటె జైల్లో అనారోగ్యంతో చావడమే మంచిదనే భావానికి లోనయ్యాడు బోసుబాబు. స్వదేశంలోకి అడుగుపెట్టకూడదు అనే ఆంక్షకు ఆయన మనస్సు అంతగా క్షోభపడింది. ఆ వీరుని ఆత్మాభిమానం అంతటిది.

ఆరోగ్యం దినదినం దిగజారిపోతున్నది. అయినా చలించలేదు. ఒక వేళ బోసుబాబు మరణించితే ప్రజలు క్రోధంతో తీవ్రఆందోళనలు జరపడం ఖాయం. అప్పుడు పరిస్థితులు అదుపుతప్పిపోవచ్చునని ఆంగ్ల ప్రభుత్వం భావించి భయపడింది.

15మే 1927నాడు ఆ నాయకుని భారతదేశంలోని అల్మోరా జైలుకు మార్చడానికి సన్నాహం కావించింది. నెహూర్రితోపాటుగా పలువురు జాతీయ నాయకులు ఆ జైల్లో కాలం గడిపారు. రంగూన్‌నుంచి లాంచిలో కలకత్తా తీసుకువచ్చారు ఆ దినం సాయంత్రం వరకు అక్కడే వుంచారు. ఉద్యమ నాయకులు ఎందరో ఆ దినం బోసుబాబుతో గడిపి రాత్రి తిరిగివచ్చారు.

ఏమి భావించిందోకాని ఆంగ్ల ప్రభుత్వం ఎటువంటి నిబంధనలులేకుండా 16 మే నాడు బోసును విడుదలచేసింది.

సొంత గృహంలోనే ఆయనకు చికిత్స ఆరంభమయింది. దేశమంతటా ఆరోగ్యం వెల్లివిరిసింది.

# కాంగ్రెస్ లో

1928 సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా భారతదేశమంతటా హర్తాళ్లు జరిగాయి. లాలాలజపతిరాయ్ అదే సందర్భంలో లాహోర్‌లో పోలీసుల దెబ్బలు తిని మంచంపట్టి మరణించాడు.

1928 డిసెంబర్‌లో జాతీయ కాంగ్రెస్ మహాసభలు కలకత్తా నగరంలో జరిగాయి.

పార్టీ నాయకుడు మోతీలాల్‌కు స్వాగతం చెప్పటానికి ఏర్పాట్లు ఘనంగా చేశాడు సుభాస్ స్వయంగా.

36 గుర్రాలను పూన్చిన శకటంలో మోతీలాల్ నెహ్రూను అతి వైభవముగా కలకత్తా పురవీధుల్లో ఊరేగించారు. వేయికి పైగా సైకిళ్ళపై వాలంటీర్లు, మహిళా కార్యకర్తలు, వేలాది ఖద్దరు ధారులు, ప్రముఖ నాయకులు, లక్షల జనం అదో పెద్ద సంరంభ పూర్వకమైన కార్యక్రమం, ఆకర్షణీయమైన దృశ్యం.

నల్లని మిలటరీ దుస్తుల్లో తెల్లటి గుర్రంపై కూర్చుని ప్రదర్శనకు ముందు వెళ్ళే సుభాస్ అందరి హృదయాల్లో చిరస్మరణీయ గౌరవానికి పాత్రుడయ్యాడు.



సభాధ్యక్షునికి వేదికవద్ద సైనికవందనంకూడా ఏర్పాటుచేశాడు. త్రివర్ణ పతాకం ఎగురవేశారు.

1931లోగా డొమినియన్ స్టేటస్ స్వాతంత్ర్యం (బ్రిటిష్ దేశానికి లోబడిన ప్రభుత్వం) అంగీకరించకపోతే సంపూర్ణ స్వరాజ్యం మా లక్ష్యమని ఆ సభలో కాంగ్రెసువారి తీర్మానం ప్రవేశపెట్టబడింది.

సంపూర్ణ స్వరాజ్య తీర్మానం ప్రవేశపెట్టినతర్వాత, ఈ సగం స్వరాజ్యం కోరటంలో అర్థంలేదని సుభాశ్చంద్రబోసు గాంధీజీతో ఘర్షణపడ్డాడు. కాంగ్రెస్ అలవాటుప్రకారం గాంధీ ప్రతిపాదనే నెగ్గింది. అయినా బోసుబాబు నిరాశపడలేదు.

కలకత్తా సభలతర్వాత బ్రిటిష్ ప్రభుత్వ దమననీతి పోలీసుల హింసాకాండ పెరిగింది.

1929 లాహోర్ కాంగ్రెస్ సభలకు జవహర్ లాల్ నెహ్రూ అధ్యక్షుడు అప్పుడు గాంధీని అధ్యక్ష స్థానానికి ఎన్నుకోవాలనుకున్నారు.కాని ఆయన అందుకు అంగీకరించలేదు. మోతీలాల్ కోరికగా యువనాయకత్వానికి విలువీయాలనీ తనకు నెహ్రూపైగల ప్రేమతో జవహర్ లాల్ను అధ్యక్షునిగా చేయాలని సూచించాడు.

ఆ సభలకు బోసుబాబు వెళ్ళాడు. గాంధీవెంట జయప్రకాశ్ నారాయణ్ వచ్చింది అదే సందర్భంలో. భగత్ సింగ్ వీరులు అసెంబ్లీలో బాంబు వేసింది అప్పటిదే.

ఆ సభలో నెహ్రూ, గాంధీజీ కోరికగా సంపూర్ణ స్వరాజ్య తీర్మానం చేశాడు. అది బోసుబాబు ఏడాదిక్రితం సూచించిందే.26 జనవరిని స్వేచ్ఛా దినంగా ప్రకటించారు.

కాంగ్రెసు పేర సొంత ప్రభుత్వాన్ని నిర్వహించాలని ఈమారు సుభాస్ సవరణ చూపించాడు. కాని జాతిపిత మాట ప్రకారం స్వతంత్ర తీర్మానంలోనే సంతృప్తిపొందారు.

## మళ్ళీ జైలు యాత్ర

1930 జనవరిలో రాజకీయ బంధితుల గౌరవార్థం, జ్ఞాపకార్థం సుభాస్ పెద్ద ఊరేగింపు జరిపి స్వాతంత్రం నినాదాలిచ్చాడు. ప్రభుత్వం ఆయనను బంధించింది.

కాంగ్రెసు నిర్ణయించిన 26 జనవరి స్వాతంత్ర్యదినాన్ని (1930) బంది అయిన మూడవనాడు బోసుబాబు జైల్లోనే తోటి ఖైదీలమధ్య నిర్వహించాడు.

ఎలా సంపాదించాడో కాని జాతీయ జండాను ఎగరవేసి మిఠాయిలు పంచాడు. జైలు అధికారులు తెల్లబోయి చూశారు.

దోషులయిన ఇతర ఖైదీలనువలె కాంగ్రెస్ బందీలనుకూడా అగౌరవముగా చూడటంతో ఆయన జైలు అధికారులతో ఘర్షణకు దిగాడు.

అధికారులు కోపంచెంది ఇతర బంధితులతోపాటు ఈ దేశనేతను క్రూరంగా హింసించారు. మెట్లపైనుంచి దొర్లించారు. లాఠీ దెబ్బలు రుచిచూపారు. ఆ సందర్భంలో బోసుబాబు ముంజేతి కీలు విరిగింది. నొప్పితో జ్వరపడ్డాడు. ఇలాంటి బాధలమధ్య ఏడాదికాలం ఆయన జైలు జీవితం గడిపాడు.

దసరా నవరాత్రులు బెంగాళీలు మహావైభవంగా జరుపుకుంటారు. దేవీ-దుర్గా, సరస్వతీ పూజలు జరుపుతారు.

'అనుశీలన సమితి' బెంగాళ్ విప్లవకారులకు దుర్గాదేవి ఆరాధ్యదైవం. 'వందేమాతరం' బంకింబాబు 'ఆనందమఠం' నవల్లోని గేయం దుర్గాదేవి స్తోత్రమే

సుభాస్ జైల్లో దుర్గా పూజలు చేసుకోవడానికి బయటనుంచి కొంత డబ్బు తెప్పించుకోవడానికి అనుమతికోరాడు. దాన్నికూడా ఒక రాజకీయ ఎత్తుగడగా భావించి అధికారులు అంగీకరించలేదు.

ప్రభుత్వ నియంతృత్వ విధానానికి నిరసనగా కారాగారంలో నిరాహార దీక్షకు పూనుకున్నాడు బోసుబాబు.

## జైలు లేఖ

జైలునుంచి సోదరుడు శరత్‌చంద్రబోసుకు హృదయవిదారకమైన లేఖ వ్రాసాడు సుభాస్.

అది ఇది—

ఇన్సీన్ సెంట్రల్ జైలు,
4 ఏప్రిల్ 1927

అన్నగారూ,

మిస్టర్ మోబర్లీ ఉదారత గురించి నేను ఏం ఆలోచిస్తున్నాననేది తెలుసుకోవడానికి మీరు ఉత్సుకులై వుంటారు. ఇప్పుడు మీముందు నేను నా హృదయం విప్పుకునే సమయం వచ్చేసింది...

నేను గౌ॥గృహమంత్రి మాటలను ఎన్నోసార్లు పత్రికల్లో చదివాను. అవి మహాచతురతతో కూడినవని నిస్సందేహంగా చెప్పవచ్చును.

చిన్నన్నయ్య డా॥సుశీల్‌చంద్రబోసు నా గురించి ఇచ్చిన రిపోర్టులో సిఫారసు గురించి నన్నడిగి చేయలేదు. అలాంటి సిఫారసును నేనెప్పుడూ అంగీకరించలేను...ప్రభుత్వం వాటిని రాజకీయ వ్యూహంలో చేర్చుతుందనే ఆలోచన కూడా ఆయనకు రాలేదు. దీని దోషం ఆయనదే...

సుశీల్ అన్నయ్య ఇచ్చిన నా ఆరోగ్య రిపోర్టును ప్రభుత్వం అంగీకరించలేదు. ఎందుకంటె ఒక గౌ॥మెంబర్ నా రోగం ఏమంత ప్రమాదకరమైనది కాదన్నాడు. ఏ పరిస్థితిలో నాది తీవ్రమయిన అనారోగ్యమని ప్రభుత్వం భావిస్తుందో మరి. ఇలాంటి స్థితిలోనూ నాకు వైద్యం లేకుండా వుంటే ఇక నా మరణానికి కొన్ని దినాలుమాత్రమే మిగిలి వున్నాయనుకోవాలి...

బెంగాలీ ప్రభుత్వం క్రిమినల్ అండ్ లా (ఎమర్జెన్సీ) శాసనం అమలు

న్నంతవరకు నేను విదేశాల్లోనే వుండాలని వాళ్ళు భావిస్తున్నారు. ఆ ఆక్టు జనవరి 30 వరకు వుంటుంది. అయినా దాన్ని ఆ తర్వాతకూడా పొడిగించరనే గ్యారంటీ ముంది?

మిస్టర్ లీమైన్ డి.ఐ.జి., ఐ.జి., సి.ఐ.డి.తో నేను మాట్లాడినదాన్ని 'బట్టి '1925 బెంగాల్ క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ ఆక్టు 1129',లో ఇంచుమించు ప్పటికోసం అది అమలుపరచబడినట్లు వ్యక్తమయింది. దీన్నిబట్టి నేను జీవించి న్నంతకాలం దేశం బయటనే వుండిపోవల్సివుంటుంది. అలాగయితే నేను ఏ తేదీ రకు విదేశాల్లో వుండాలనే విషయంలో ప్రభుత్వంతో మనమే ఒక ఆర్డినెన్స్ లువరించవలసి వుంటుంది.

స్విడ్జర్లాండ్‌లో బ్రిటిష్‌వాళ్ళను మినహాయిస్తే ఇటలీ, ఫ్రెంచి, జర్మనీ, ిందూస్థానీ వ్యక్తులను అనుమాన పరిస్థితుల్లో నీడలా వెంబడిస్తారని తెల్పింది.

నాకు మన మాతృదేశాన్ని వదలి పోవాలంటే ఇష్టంగాలేదు. ప్రభుత్వం ఈ విషయంలో పునరాలోచించాలి.

నేను భారత్, బర్మా, శ్రీలంక దేశాల్లో తిరిగి ప్రవేశించకూడదని నిబం న విధించుతున్నారని తెలిసింది. దాంతో నాలో ఈ ఆలోచనలు వస్తున్నవి.

"నేను బ్రిటిష్ ప్రభుత్వం నిలకడకు అంతటి ప్రమాదకారినా? కేవలం క్క బెంగాల్‌కు దూరంగా వుంటేసరిపోదా... బెంగాల్ ప్రభుత్వానికి తప్ప భారత శ ఇతర ప్రాంతీయ ప్రభుత్వాలకు నాపై ఎలాంటి నేరారోపణ లేదుకదా"

నేను దాదాపు రెండున్నర సంవత్సరాలనుండి ఇంటికి దూరంగా వుండి, ల్లిదండ్రులను, బంధుమిత్రులను కలుసుకోలేకపోయానని ప్రభుత్వానికి తెల్పు.

ఇప్పుడు నేను యూరోపు వెళ్ళితే దాదాపు మూడేండ్లు తీసుకుంటుంది. ఈమధ్య మనవాళ్ళను కల్సుకోవడానికి ఎట్లాంటి పీలుండదు. ఇది నాకు, అంతకంటె నన్ను ప్రేమించేవారికి మరీ కఠోరమైన విషయం. తూర్పు దేశాలవాళ్ళు తమ సంబంధీకులను ఎంత ప్రేమిస్తారో అది పాశ్చాత్యులు అర్థంచేసుకోవడం కష్టం.

ఈ రెండున్నర సంవత్సరాలు ప్రభుత్వం నన్నెంత యాతనలపాలు చేసిందో మరచిపోయింది. ఇంతకాలం అది అకారణంగా నన్ను బంధించి వుంచింది అస్త్ర శస్త్రాలు సేకరించి బాంబులు తయారుచేసి పోలీసు ఆఫీసర్లను చంపే దోషినని నాతో వాళ్ళన్నారు. ఇలాంటి పరిస్థితిలో సర్ ఎడ్వర్డ్ మార్షల్ లేదా సర్ జాన్ సైమన్‌లపై ఇలాగే నేరారోపణ కావిస్తే వారు నిరపరాధులమని అనటంతప్ప ఏ సాక్ష్యంతో తమ నిర్దోషిత్వం నిరూపించుకోగల్గుతారు?

ప్రభుత్వం ఇతరత్రా నీతిగా మెదిలేవిషయం వదిలేసినా కనీసం నా శారీరక అవస్థనయినా దూరం చేయవల్సి వుండేది. ఇలాంటి బాధే నాకు 1924లో వుండేది, జైల్లోనే నా ఆరోగ్యం చెడిపోయింది కాబట్టి నా ఆరోగ్యం బాగుచేయవల్సిన బాధ్యత ప్రభుత్వానిది. నా ఆరోగ్యం కుదుటపడేవరకు వైద్య ఖర్చులు భరించవలసిన బాధ్యతకూడా దానిదే. ఒకసారి నన్ను ఇంటివరకు వెళ్ళడానికి ప్రభుత్వం అనుమతిస్తే నా యూరోపు యాత్ర ఖర్చులన్నీ నేనే భరించుకోగల్గుతాను. అలా అనుమతిస్తే అది వారి మంచితనమే కాగలదు.

నాకు శ్రీ దేవబంధు జ్ఞప్తికి వస్తున్నాడు. వారు నన్ను "వయసు ముసలయ్యా" అని పిలిచేవారు. ఎందుకంటే ఆయనకు నాలో ఒకరకమైన నిరాశ కన్పించేది. ఆ దృష్టిలో నేను నిరాశావాదినే-నేను చెడు ఫలితాల ఆలోచనలు చేసే

వాడిని. ప్రభుత్వపు ఈ ఉదారతను స్వీకరించక నేను భయంకర పరిణామాలను ఆలోచించే ప్రయత్నం చేస్తున్నాను. కాని నేను స్వదేశంనుంచి జీవితకాలమంతా బహిష్కృతుడుగా వుండడాన్ని, మరణ పర్యంతం జైలు జీవితాన్ని గడపడాన్ని శ్రేయస్కరంగా భావిస్తూలేను.

....స్వాతంత్ర్యం అనే అమూల్య సంపదను సాధించుకోవడానికి మనం వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ ఇంకా యెన్నో బలిదానాలు చేయవల్సి వుంది.



ఈశ్వరుడికి నా ధన్యవాదాలు. నేను ప్రశాంతిగా వున్నాను. ఎలాంటి అగ్నిపరీక్షలనయినా యెదుర్కోవడానికి నేను సిద్ధంగా వున్నాను. భారతదేశపు గత పాపాలకు కొద్దిమాత్రంగానయినా ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాననుకోవడంలో నాకు ప్రశాంతి వుంది-ఆనందముంది.

ఇది నిజం. మన ఆలోచనలు చావవు. మన ఆదర్శం దేశస్మృతిలో చెరగిపోదు. రాబోవు జనం మన చిరకాల స్వప్నాలకు వారసులు కాగలరు అంతే; ఈ విశ్వాసమే సదా నన్ను ఎలాంటి కఠిన పరీక్షలలోనయినా విజేతను కావిస్తుంటుంది.

దయచేసి ఉత్తరానికి జవాబు తొందరగా ఇవ్వండి.

—మీ పరమ స్నేహపాత్రుడు,

సుభాస్-"

దీనికి కొన్నిరోజుల తర్వాత బోసుబాబు విడుదల కాదు కాని,ఆయనను అల్మోరా జైలుకు పంపనున్నట్లు ఆర్డర్ విడుదల అయింది. అంతలో రెండవ డాక్టర్ రిపోర్టులో ఆయన ఆరోగ్య పరిస్థితి మరీ వికటించినట్లు పేర్కొనబడింది. దానితో వైద్య నిమిత్తం ఆయనను స్వేచ్ఛగా వదిలివేయవల్సిందిగా బెంగాళీ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది.

ఆ వార్త తండ్రిద్వారా విని శరశ్చంద్రబోసు ఆనందంతో జైలుకు పరుగెత్తాడు. సుభాసు ప్రేమాధిక్యంతో అన్నను కౌగలించుకున్నాడు.

## దేశవాసులకు సందేశం

"ఇప్పుడే నేను మా ఇంటికి చేరుకున్నాను. నేను నా కార్యక్రమాన్ని ఆరంభించటానికి ముందు నా ఆరోగ్యాన్ని బాగుచేసుకోవల్సి వుంది. ఇంతకాలం జైల్లో వున్నకారణంగా నా సహచరుల జ్ఞాపకం రేయింబవళ్ళు నన్ను బాధిస్తున్నది. నేను త్వరగా కోలుకొని నా మనఃప్రాణాలను లగ్నంచేసి నా ధ్యేయప్రాప్తికోసం పూనుకోవాలని నా దేశవాసులు కోరుకుంటారని ఆశిస్తున్నాను"

సుభాస్ ఆదర్శంలో మార్పులేదు. పట్టుదలలో చలనంలేదు.

తనిసిరే వేల్పులుదధి రత్నములచేత
వెరచిరే ఘోర కాకోల విషముచేత
విడిచిరే యత్నమమృతమ్ము వొడము దనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణ మతులు!

తమ ప్రియతమ నేత విడుదలకు దేశమంతటా ఆనందం వెల్లివిరిసింది. విముక్తి సభలు, సమావేశాలు జరిగాయి. బోసుబాబు ఆరోగ్యానికి ప్రార్థనలు చేశారు. శుభాకాంక్షలు తెలిపారు.

బోసుబాబు దర్శనార్థం వచ్చిపోయే జనంతో వారిల్లు ఒక ప్రముఖ యాత్రాస్థలంగా మారిపోయింది. ఆకాశం చిల్లులు పడేటంతటి విజయ నినాదాలుచేసి ప్రజలు తమ ఆనందాన్ని వ్యక్తపరిచారు.

'నేతాజీ చిరంజీవి కావాలి!'

'విప్లవం వర్ధిల్లాలి!'

# తిరిగి ఉద్యమించాడు

బోసు ఆరోగ్యం పూర్తిగా కోలుకోనేలేదు, అయినప్పటికి వెళ్ళి గాంధీజీ 'దండి' ఉప్పు సత్యాగ్రహం 1930 లో పాల్గొన్నాడు.

బొంబాయి, మధుర, కలకత్తా అనేక ప్రాంతాల ప్రజాసభల్లో పాల్గొని ప్రభుత్వ దుష్టనీతిని, హింసాకాండను నిర్భయంగా విమర్శించసాగాడు.

సుభాస్ కార్యశీలతను చూసి ఒక దినపత్రిక ఇలా వ్రాసింది.

"తీవ్రవాదుల యువకుల నాయకుడు సుభాశ్చంద్రబోసు గత సంవత్సరములో బీమారీ కారణంగా జైలునుంచి విడుదల పొందినాడు. తన అమేయశక్తితో తిరిగి ఆరోగ్యాన్ని పుంజుకొని రాజకీయ పోరాట కర్మక్షేత్రంలో దిగారు. ఆయన ప్రభావం మరియు కార్యదీక్షతలను చూస్తే మహాత్మా గాంధీజీ స్థానాన్ని ఆక్రమించదుకదా అనిపిస్తున్నది"

పాట్నా సభలో బోసు ప్రసంగంలో-

"ప్రస్తుత దేశ స్థితిగతిలో మనం అనారోగ్యపడి వుండడానికికూడా వీలులేదు" అని హెచ్చరించాడు.

పాట్నానుంచి తిరిగి రాగానే విదేశీ వస్త్ర బహిష్కారం ముమ్మరం చేశాడు. ఆయన ఆందోళనలో వేలాది వంగదేశ స్త్రీలుకూడా పాల్గొన్నారు. సత్యాగ్రహాల శాసనోల్లంఘనల తీవ్రతకు జడుసుకొని ప్రభుత్వం 144 సెక్షన్ పెట్టి నాయకులను కారాగారాల్లో పడవేసింది.



కలకత్తా మేయర్‌గా ఎన్నికైన సుభాసు 26 జనవరి 1931 స్వాతంత్ర్య దినాన్ని ఘనంగా జరపాలని నిశ్చయించుకున్నాడు. 1930 జనవరిలో మొదటి స్వాతంత్ర్యదినాన్ని జైలుగోడలమధ్య, తోటి ఖైదీలమధ్య సామాన్యంగానయినా అతిసాహసంగా జరిపాడు.

సాయంత్రం 4 గంటలకు త్రివర్ణ పతాకాన్ని చేతపట్టుకొని పెద్ద ఊరేగింపుకు ముందు నడిచాడు బోసు. ప్రభుత్వంవారు పెద్ద సంఖ్యలో పోలీసులను దించారు. లాఠీచార్జి జరిపించి సభను చెల్లాచెదరు కావించారు. సుభాస్‌ను అరెస్టుచేసి మళ్ళీ బందిఖానాకు పంపారు. అయితే ఈమారు ఎక్కువకాలం వుండలేదక్కడ. గాంధీ ఇర్విన్ ఒడంబడికవల్ల ఆరుమాసాలకు ముందే 1931 మార్చిలో విడుదల అయ్యాడు.

## మళ్ళీ బందీ అయ్యాడు

1930 మొదటి రౌండ్ టేబిల్ సమావేశాన్ని కాంగ్రెస్ బహిష్కరించింది. 1931 రెండవ సమావేశానికి వెళ్ళకూడదనుకున్నా, వెళ్ళడంవల్ల ఏదయినా ప్రయోజనం దేశ స్వాతంత్ర్యంకోసం కలగవచ్చుననే భావంతో గాంధీని లండన్ పంపించారు. చర్చలు విఫలమైనవి. గాంధీజీ నిరాశతో ఇండియాలో అడుగుపెట్టగానే ఆంగ్ల ప్రభుత్వం ఆయనను బంధించింది. ఆ అరెస్టుల వరుసలోనే నెహ్రూతో పాటుగా సుభాస్‌కూడా బంధించబడ్డాడు.

మాటిమాటికి చెరసాల జీవితం గడపడంవల్ల ఆయన ఆరోగ్యం దయనీయంగా మారింది. ప్రథమశ్రేణి ఖైదీ అయినా సామాన్య బందీల సరసనే వుంచబడి అనేక భయానక కష్టాలను చవిచూసాడు.

కడుపునొప్పితోపాటు ఊపిరితిత్తుల్లో అవస్థ ఏర్పడటంతో ఆయన అనారోగ్యం తీవ్రవస్థాయికి చేరుకొంది. ఆ నాయకుని వదలివేయాలని బయటనుంచి ఒత్తిడి అధికమైంది.

వైద్యానికి యూరోపు వెళ్ళడానికి అనుమతించినా, వెళ్ళేముందు తల్లి దండ్రులనయినా కల్సుకునే అవకాశం కల్పించబడలేదు. అది బ్రిటిష్ ప్రభుత్వం ప్రదర్శించిన ఘనత-మానవత.

సెయాన్‌లో ఆరోగ్యం చెడిపోయినతర్వాత ఆయనను జబల్‌పూర్, మద్రాసు జైళ్ళకు మార్చారు. విధిలేని పరిస్థితిలో స్విస్‌కు వెళ్ళడానికి ఒప్పు కున్నారు. ఆ ప్రయాణానికి ముందు దశను సుభాస్ దిలీప్‌కు వ్రాసిన లేఖలో యెంత దయనీయంగా వుందో చూడండి-

"వైద్యం కోసం నేను యూరోపు వెళ్తాననే విషయంపై నాకేమాత్రం నమ్మకంలేదు. సర్కారు కుటిలనీతివల్ల నేను నా కన్నవాళ్ళనయినా కల్సుకునే వీలుకలగలేదు. కేవలం కొందరు మిత్రులు నన్ను జబల్‌పూర్ జైల్లో కల్సుకో గలిగారు. బొంబాయికి నన్ను చూడడానికి వచ్చిన మిత్రులు నిరాశతో తిరిగివెళ్లారు. మా ఓడ కదిలేవరకు పోలీసు ఆఫీసర్లు వేటకుక్కల మందవలె ఓడ నాల్గువైపుల చుట్టివున్నారు. ఆ స్థితిని చూసి నా మనస్సుకు చాల బాధవేసింది"

దేశనాయకులు బోసు మిత్రులు ఎందరో ఆయనను చూడాలని హార్బ రులో నిలిచివున్నారు. దూరంగా ఓడపై బోసు నిలిచాడు. ఓడ కదిలేముందు చేయి ఊపడం తప్ప మరే మాటా పలికే వీలులేకపోయింది.

ఆయన వెళ్ళడానికి కొన్ని క్షణాలముందు ముగ్గురు సోదరులు సుశీల్, అమీయ్, డా॥సునీల్ బోసులు కల్సుకున్నారు. బోసు గంభీరంగా మాట్లాడాడు.

ఓడ కదిలిన తర్వాత ఒక పోలీసు అధికారి వచ్చి సుభాస్‌పై వున్న రెగ్యులేషన్ అరెస్టు రద్దయిందని చెప్పితే ఆయన మౌనంగానే వున్నాడు.

శరశ్చంద్ర బోసుకూడా జైలులో వున్నకారణంగా ఇంటినుంచి ఆయనకు ఆర్థికసహాయం అందలేదు. మిత్రుల ఆర్థికసహాయంతో పాటు హార్దిక శుభాకాంక్షలతో యూరోపులో అడుగుపెట్టాడు.

# యూరపులో

వియన్నాలో బోసుబాబుకు ఆపరేషన్ జరిగింది. తర్వాత వెన్నిస్‌లో ప్రసిద్ధ ఆస్ట్రియా రచయిత ములర్ ఆతిథ్యంలో కొన్ని మాసాలున్నాడు. అక్కడ ఊరకే కూర్చోలేదు. తాను వ్రాయ సంకల్పించిన 'ఇండియా స్ట్రగుల్' (భారత పోరాటం) పుస్తక రచన ఆరంభించాడు. ఆయన పరిస్థితిని, ఉత్సాహాన్ని చూసి ములర్, మిస్.ఎమిల్ శెంకెన్ అనే స్టెనోను ఏర్పాటుచేయడంతో పుస్తకం చక్కగా రూపొంది బోసు సంతృప్తిచెందాడు.

ఆ తర్వాత చికిత్సకోసం స్విట్జర్లాండ్‌కు వెళ్ళాడు. ఈమధ్యకాలంలో రాజకీయాలకు దూరంగా వుండలేదు.

రోములో ప్రాచ్య విద్యార్థుల సమ్మేళనం జరిగింది. అనేక దేశాల విద్యార్థులు అందులో పాల్గొన్నారు. సుభాసు ఆ సభలో ఉపన్యసించి అందరి ఆమోదంతో అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. విద్యార్థుల ఆందోళనలగూర్చి ఇలా ప్రస్తావించాడు.

"భారత విద్యార్థుల ఆందోళన రాజకీయ పోరాటంతో ముడిపడి వుంది. ఇటలీ మొదలగు దేశాల ఆందోళనలు చూసి భారత విద్యార్థులు తమ పోరాటాన్ని దృఢపర్చవలసి వుంది"



తర్వాత పోలెండ్ వెళ్ళి అనేకమంది ప్రముఖులను కల్సుకున్నాడు. అక్కడి పోరాటకారులకు తన సానుభూతి తెలిపాడు. వైజ్ఞానిక పద్ధతిలో విద్యాబోధన జరుగుతున్న అక్కడి పలుపాఠశాలలు చూశాడు.

వార్సాలో స్వదేశ సంస్కృతీ ప్రియులయిన భారతీయులను కలిశాడు. జెనీవానుంచి దక్షిణ ఫ్రాన్సు వెళ్ళి తిరిగి రోం చేరుకున్నాడు. అక్కడ భారత–ఇటలీ సంబంధాలగూర్చి జరిగిన మహాసభలో ప్రసంగించాడు.

ఆయన ఆరోగ్యం చాలావరకు కుదుటపడింది.

సుందర ప్రకృతి శోభలతో అలరారే చెకోస్లోవేకియాకు వెళ్ళాడు. అక్కడి వేడినీటి ప్రవాహాల్లో స్నానంచేస్తే ఆరోగ్యం కలుగుతుందని ప్రజల విశ్వాసం.

జెనీవాలో భారతదేశ విషయాలపై అంతర రాష్ట్రీయ సమ్మేళనం జరిగింది. విశ్వంలోని ప్రముఖ దేశాలన్నీ అందులో పాల్గొన్నాయి. బోసు ఆ సదస్సులో పాల్గొని గంభీరంగా ప్రసంగించాడు.

"భారత వర్తమానస్థితిని తెల్సుకోవడానికి ముందు అక్కడ ఎలాంటి కఠిన దమననీతి ఆచరించబడుతున్నదో, ఎంతమందిని విచక్షణ లేకుండా జైళ్ళలో బందించారో గ్రహించడం అవసరం. జైళ్ళనుంచి విడుదల పొందిన వారుకూడా బందీలుగానే వున్నారు. మానవజీవితాలు అక్కడ ఆటవిక వ్యవస్థలో వున్నవి... ఎంతవరకయితే జనం మౌలికమయిన మానసిక అధికారంనుంచి వంచింపబడతారో వాళ్లు ఇతరుల పీడనకు కారణమౌతుంటారో అంతవరకు అశాంతి దూరంకాదు.

భారత్‌లోని సమస్య కేవలం దేశసమస్యమాత్రమే కాదు. అది పూర్తి ప్రపంచ సమస్య. భారతదేశంలో బ్రిటిష్ రాజరికం ఆంగ్ల సామ్రాజ్యవాదంపై ఆధారపడివుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాద విషవృక్షంపై విశ్వసామ్రాజ్యవాదం ఆధారపడివుంది. అందుకోసం భారత విముక్తికోసం ప్రయత్నం విశ్వస్వేచ్ఛ కోసం పోరాడటమే"

అక్కడినుండి విశ్వరాజకీయాలనుగూర్చి అధ్యయనంచేస్తూ భారత పత్రికలకు అనేక విషయాలపై వ్రాస్తుండేవాడు.

1933లో గాంధీ సత్యాగ్రహోద్యమాన్ని విరమించినప్పుడు విఠల్‌భాయి పటేలు ఎంతగానో విచారించాడు. ఆయనకు ఆశాకిరణంగా బోసుబాబు కన్పించాడు.

బోసుబాబు లండన్‌లో వుండగా హిందూ దేశ రాజకీయాల సభ జరిగింది. దానికి ఆయన అధ్యక్షులుగా ఎన్నుకోబడినా ప్రభుత్వం అంగీకరించక పోవటంతో తన ప్రసంగంవ్రాసి సభకు పంపించాడు.

వియన్నాలోని ఒక ప్రసిద్ధ పత్రిక ఇలా పేర్కొంది.

"ఈమధ్య ఒక సుప్రసిద్ధ భారతీయ అతిధి వియన్నాలో వుంటున్నారు చూడ్డానికి అతడు ఐరోపా వ్యక్తివలె వుంటారు, కాని ఆలోచనా సరళిలో సంస్కృతీ వ్యవహారంలో ఆయన అచ్చమయిన హైందవుడు. ఆయన తన దేశ స్వాతంత్ర్యపోరాటంలో మహాయోధుడు. గొప్ప విద్యావేత్త, వక్త. అతని పాండిత్యానికి, విజ్ఞానానికి పరిమితిలేదు. ఆయనే సుభాష్చంద్రబోసు నామంతో ప్రఖ్యాతి చెందినవారు"

అక్కడ వున్నన్ని రోజులు వివిన్న దేశాల్లో సంచరించి పలువురు నాయకుల అభిమానాన్ని చూరగొని స్వేచ్ఛా పోరాటాన్ని బలసంపన్నం చేయడానికి కృషిచేశాడు. ఇంకా కొంతకాలం అక్కడే వుండాలని వున్నప్పటికీ తండ్రి రాయ బహద్దూర్ అవసాన దశలో వున్నట్లు తెలిసి స్వదేశానికి తిరుగుముఖం పట్టాడు.

## కరాచీలో కస్టమ్స్‌వారి ఘనకార్యం

స్వదేశంలో అడుగుపెట్టగానే కరాచీలో కస్టమ్స్ శాఖవారు సుభాస్ తెచ్చుకున్న సామగ్రిని సోదాచేసి 'ఇండియన్ స్ట్రగుల్' ప్రతిని స్వాధీనపరచు

కొన్నారు. అది చూసి ప్రభుత్వం బోసును ప్రమాదకరమయిన వ్యక్తిగా ముద్ర వేసి ఏడుసంవత్సరాలు ఎటూ కదలకూడదని గృహ నిర్బంధ శిక్ష విధించింది.

ఆ పుస్తకం ప్రతి ఒకటి ఇంగ్లాండ్ విషార్ట్ పుస్తక ప్రచురణ సంస్థలో వుండి తర్వాత వెలువడి దేశ విదేశవేత్తల ప్రశంసల నందుకొంది.

వేలాదిమంది అభిమానులు జయనినాదాలు చేస్తూ బోసుబాబుకు స్వాగతం చెప్పటానికి విమానాశ్రయంలో వేచివున్నారు. కాని ప్రభుత్వ వాహనంలో ఎవరినీ కలవనీయకుండా ఆయనను కలకత్తా తీసుకువెళ్ళారు.

సుభాస్‌ను ఆయన ఇంటికి చేర్చి బయటకు రాకూడదని, ఇంటి వ్యక్తులు తప్ప మరెవరూ ఆయనను చూసే వీలులేదని, ఎవరయిన ఈ నిబంధనను అతిక్రమిస్తే జైలుశిక్ష-డబ్బు జుల్మానా రెండు శిక్షలకు పాత్రులవుతారని ప్రభుత్వ ఉత్తర్వును చూపారు.

బయటకు వెళ్ళకూడదు, పత్రికలకు ఏమీ వ్రాయకూడదు. అతనికి వచ్చే ఉత్తరాలుకూడా పరిశీలించిన తర్వాతనే పంపించేవారు ఈ పరిస్థితికి బోసు ఖిన్నుడయ్యాడు.

జానకీనాథ్ కొడుకును చూడాలనే కోరికతోనే ఇన్ని దినాలు జీవించి వున్నాడేమో అన్నట్లు ఆఖరి క్షణాల్లో వున్నాడు.

అంతటికీ ప్రభుత్వానికి సంతృప్తి కలిగినట్లు లేదు. వారం రోజుల్లో దేశాన్ని విడిచి ఆయనను యూరోపుకు వెళ్ళిపోవాలని ఆదేశించింది. తండ్రి పరిస్థితి మరీ క్షీణించి వున్నకారణంగా ఒక మాసం అదనంగా గడువుకోరాడు సుభాస్.

రాయబహద్దూర్ ప్రియపుత్రుని సుభాష్చంద్రుని చూస్తూ అనంతృప్తి తోనే తుదిశ్వాస వదిలాడు-1934.

కొంతకాలం బోసు ఇంట్లో గడిపాడు. తండ్రి మృతి కర్మకాండలో పాల్గొన్నాడు. దుఃఖ వివశతవల్ల ఆయన ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. బంధు మిత్రులు పరామర్శకు వచ్చినప్పుడు అనేక విషయాలు ముచ్చటించేవారు.మాట్లాడ డానికి కూడా శక్తిచాలని సుభాష్ వినయంగా, విచారంగా, మౌనంగా వారికి నమస్క రించేవాడు.

## రెండవసారి యూరోపు యాత్ర

కేవలం ఒక మాసం స్వదేశంలో అదీ సొంత ఇంటిలో బందీగా గడిపి బోసు విక్టోరియా నౌకలో యూరోపుకు వెళ్ళాడు.

ఈతేప అంతర్జాతీయంగా చాల ప్రయోజనాన్ని సాధించాడు. జర్మనీ రాజధాని బెర్లిన్ నగర మేయర్ అపార గౌరవంతో సుభాష్‌కు స్వాగతం పలికాడు. అదే సమయంలో జర్మనీ నియంత హిట్లర్‌ను కలిసాడు.

"మీరు బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఆయుధాలను లేవనెత్తే విషయంలో ఏమాలోచిస్తున్నారు? మీకు మేం సహాయంగా వుంటాం" అన్నాడు హిట్లర్. బోసు ఇలా జవాబిచ్చాడు.

"మేం బ్రిటన్‌కు విరుద్ధంగా ఆయుధాలుపట్టే ఆలోచనలో లేము.ఎందు కంటే త్వరలోనే అది మా కోరికను పూర్తిచేస్తుందనే ఆశ మాకుంది" అదీ అప్పటి ఆయన శాంతిమార్గం-విశ్వాసం.

తర్వాత ఫ్రాన్సు, ఐర్లండు దేశాలకు వెళ్ళాడు. ఐరిష్ ప్రధాని ఈ భారత విముక్తి పోరాట వీరునికి స్వాగతం చెప్పాడు. ఫ్రాన్సులో ఇటలీ నేత ముస్సోలినిని కలిశాడు. ఎక్కడికి వెళ్ళినా భారత స్వేచ్ఛా పోరాటానికి సానుభూతి సహకారాలను పొందగలిగాడు.

తర్వాత లండన్ కూడా వెళ్ళాడు. అది ఆంగ్లేయుల జన్మదేశమైనా భారతీయులెందరో దేశ స్వాతంత్ర్యంకోసం కలలు కనేవారున్నారు. లండన్‌లో ఇండియా హవుజ్ విప్లవకారులకు పుట్టినిల్లు. ముఖ్యంగా పై చదువులకు వెళ్ళిన భారత యువకులు అక్కడ విప్లవభావాలు నింపుకునేవారు. వినాయక సావర్కార్, అరవింద ఘోష్...అక్కడినుంచి విప్లవించినవారే.

ఈ తూరి తుఫానులా విదేశాల పర్యటన కావించి అనేక విషయాలను గ్రహించి స్వదేశం తిరిగి రావాలనుకున్నాడు. అందుకు ప్రభుత్వం అనుమతించలేదు. స్వదేశానికి వెళ్ళితే శిక్ష తప్పదు. విదేశాల్లో తానేమీ సాధించలేడు. ఏమైనా కానీ అని పయనం అయ్యాడు.

బొంబాయిలో బోసుబాబు విమానం దిగటమే ఆలస్యం వారెంట్ ఆర్డర్‌తో పోలీసులు ప్రత్యక్షం-అధిక సంఖ్యలో చేరిన అభిమానులు అంతా రెండు నిముషాలైనా ఆయన్తో ప్రసంగించలేదు. పోలీసు వ్యాను ఎక్కవల్సి వచ్చింది.

విచారంగా తమ నాయకుని చూస్తూ-ఉద్రేకంతో నినాదాలుచేస్తూ నిస్సహాయులై నిలిచివున్న జన సమూహాన్ని వుద్దేశించి చివరగా రెండు మాటలు చెప్పాడు ఆ దేశ నేత.

"స్వతంత్ర పతాకాన్ని పైకెత్తే వుంచండి. ఈ పోరాటంలో చివరికి మన విజయం తథ్యం-"

పోలీసువ్యాన్ అర్ధర్‌రోడ్ జైలుకు ఆయనను చేర్చింది.

లక్నో కాంగ్రెసు సభలకు వెళ్ళాలని వచ్చినా ఆయన కోరిక నెరవేర లేదు. భార్య కమల మరణించిన దుఃఖంలో వున్న జవహర్‌లాల్ నెహ్రూ ఆ 1936 సభలకు అధ్యక్షత వహించాడు. బోసును ప్రభుత్వం బంధించడాన్ని ఆ సభలో తీవ్రంగా ఖండిస్తూ తీర్మానం చేశారు.

## కారాగారవాసం

బోసుబాబు 18 సంవత్సరాల రాజకీయ జీవితంలో 10 సం॥కు పై బడిన కాలం జైళ్ళలోనే గడిచింది. మళ్ళీ ఆ నాయకుని ఆరోగ్యం వికటించింది. డా॥ ఎడోల్ఫ్ హెచ్చరికను కూడా ప్రభుత్వం లెక్కచేయలేదు. అర్ధర్ రోడ్ జైలునుంచి ఎరవాడ జైలుకు మార్చింది.

అక్కడ స్వేచ్ఛగా వాయుప్రసారమైనా లేని చీకటి కొట్టులో విష పూరితమైన వాతావరణంలో వుంచింది. ఆ ఆంగ్లవైద్యుడు అన్నట్లుగానే విదేశాల్లో బాగుపడిన బోసు ఆరోగ్యం స్వదేశ బందీ జీవనంతో పూర్తిగా చెడిపోయింది.

కపట సానుభూతి కనబరుస్తూ ప్రభుత్వం బోసును విడుదల చేస్తూ ఆయన అన్న శరత్ గృహం కుర్సియాంగ్‌లో గృహ నిర్బంధంలో వుంచింది. ఆయన ఆరోగ్యం మరి ప్రమాద స్థాయికి చేరుకుంది. ఇంగ్లాండు అసెంబ్లీలో కూడా ఆంగ్లప్రభుత్వం ఈ విషయంలో అనేక ప్రశ్నల నెదుర్కొంది. ఇది ప్రభుత్వ ఆటవిక చర్యగా నిందా పాత్రమైంది.

పత్రికలు ప్రభుత్వ క్రూరబుద్ధిని విమర్శించాయి. ప్రజలు అలజడి చెందారు. నెహ్రూ కోరికగా నేతాజీ అభినందన దినం పాటించబడింది.

ఎక్స్‌రే పరీక్ష చికిత్సకోసం బోసును కలకత్తా మెడికల్ కాలేజీకి పంపించారు. ఆయన విడుదలకోసం దేశమంతటా తీవ్ర ఆందోళనలు చెలరేగాయి. ఆ ఒత్తిడిని తట్టుకోలేక 17 మాసాల బంధనం తర్వాత బేషరుతుగా బోసు విడుదల జరిగింది.

## దేశంకోసం సర్వస్వం త్యాగం చేశాడు

"సంపూర్ణ భారతభూమిని ఒక బలమైన దేశంగా రూపొందించడానికి మనమందరం ఒక్కటై రాష్ట్రపతాకం నీడలో నిలబడాల్సివుంది. మనం మన వుద్యమంలో కూలీలకు, రైతులకు, మధ్యతరగతి ప్రజలకు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటసేనలో ప్రముఖస్థానం ఇవ్వాలి. అన్నిటికంటె ముఖ్యమైన విషయం-ఆకలితో దాస్యంతో ఉన్నవారల ఆర్థిక మరియు రాజకీయ విముక్తికోసం సామ్రాజ్యవాద విరోధి శక్తులతో చేతులు కలపాలి. మన సంఘర్షణ అహింసా మార్గంలోనే సాగాలి."

ప్రజల కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. తర్వాత బోసు బందీ గృహానికి వెళ్ళాడు.

సుభాస్ క్షీణ శరీరాన్ని చూసి పసిపిల్లవానిలా ఏడ్చాడు దిలీప్. "ఏమిటీ కేంబ్రిడ్జిలో సుగుణం సౌందర్యంతో ప్రకాశించిన ఆ సుభాసు నేనా నువ్వు-" అని అడిగాడు. బోసు జవాబు ఇలాగుంది. "నేను శారీరకంగా దుర్బలుడను కావచ్చు.

అయినా, ఆత్మశక్తిలో ఆలోచనా ధోరణిలో ఆదర్శంలో ఇప్పటికీ దృఢంగానే వున్నాను." కుటుంబ సభ్యుల సుభాస్ దయనీయ పరిస్థితికి విచారించినా ఆయన లోక ప్రియత పేరు ప్రతిష్ఠలు మౌనులు చేసినై.

ఆయనకు చికిత్స ఆరంభమయింది. డాక్టర్ ధర్మవీర్ సలహా ప్రకారం పంజాబ్‌లోని డల్‌హౌజీ వైద్యాలయంలో చేరాడు. అక్కడ ప్రయోజనం కన్పించక డాక్టర్ సూచనతో తిరిగి యూరోప్‌కే వెళ్ళాడు.

లండన్‌లో విక్టోరియా స్టేషన్‌లో సుభాస్ దిగగానే 'విప్లవం వర్ధిల్లాలి' అనే భారత పోరాటకారుల నినాదాలు, ఆ బ్రిటిష్ రాజధానిలో మార్మోగాయి.



భారతీయ విద్యార్ధి సంఘం మొట్టమొదట ఆయనకు అభినందనలు తెలిపారు. పత్రికా విలేకరులు పలువిధాల ప్రశ్నలువేసి జవాబులు రాబట్టారు.

"తమ సిద్ధాంతాలను తిరిగి సరిచేసుకునేంత వరకు కాంగ్రెసుతో ఏ మహత్తర కార్యంకాదు." అని స్పష్టంగా చెప్పాడు బోసు.

కానవేహాల్‌లోని ఒక మహాసభలో ప్రసంగించాడు. తన చికిత్స - వైద్యంకంటె మిన్నగా దేశదాస్యరోగ చికిత్సకోసమే సమయాన్ని కేటాయించాడు.

## జాతీయ కాంగ్రెసు సభాధ్యక్షుడుగా—

సుభాసు ఇంగ్లాండులో ఉండగనే ఇటు ఇండియాలో భారత జాతీయ కాంగ్రెసు 1938 సభలకు అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డాడు. అందుకు కాంగ్రెసు నాయకులు తీవ్రంగా విభేధించారు. వ్యతిరేక ప్రచారాలు కావించారు. యువశక్తుల ఉగ్రవాదుల బలంతో బోసు అధికసంఖ్యతోనే నెగ్గాడు. గాంధీకికూడా సుభాసు ఎంపిక ఇష్టంగాలేదు. అందుకు కారణం సుభాసు కలకత్తా, లాహోరు, లక్నో పలు జాతీయ సభల్లో పదేండ్లుగా గాంధీ సిద్ధాంతాలను తీవ్రంగా వ్యతిరేకించడం - జనాదరణకు అధిక పాత్రుడు కావడం, అది నత్తనడక కాంగ్రెసు వృద్ధ నాయకులకు నచ్చలేదు.

"సుభాస్ దేశానికి మరియు గాంధీజీకి ఏం అపరాధం చేశాడని. వారి ఏ పవిత్ర ఆశయాలపై గొడ్డలిదెబ్బ వేశాడు? ఆయన దోషం ఏదయినా వుందంటే అది, గాంధీజీవలె దయనీయంగా బిచ్చమడిగి స్వాతంత్ర్యం తెచ్చుకోవాలను కోవడం నచ్చదు. పోరాటమార్గాల వివాదం జోలికిపోడు.

ఆయనకు మాతృభూమి స్వేచ్ఛ ధ్యేయం, దానికోసం ఏ పోరాట విధానాన్ని అనుసరించడానికైనా ఆయన సంకోచించడు-వెనుకడుగు వేయడు." —

శంకర్ సుల్తాన్‌పురి.

## ముస్లింల చర్యాలు

కాంగ్రెసంటే ముస్లింలలో మొదటినుంచి భయం నాటుకొనివుంది. అది హిందూసంస్థ అని, స్వతంత్రం లభిస్తే ప్రభుత్వం హిందువుల చేతికి వస్తుందని, ముస్లింలకు బానిసత్వం తప్పదని, అబద్ధపు ప్రచారంతో కూటనీతితో వారిని భయ పెట్టింది ఆంగ్ల ప్రభుత్వం.

అది ఎప్పుడు ఎందుకు ముస్లింలు భారతదేశంలో ప్రవేశించినా దాదాపు వెయ్యేండ్ల రాజరిక-పౌరజీవన చరిత్ర భారతదేశంతో ముడిపడివుంది. ఎలా పాలించినా-జీవించినా సంఖ్య పెంచుకున్నారు. ఇక్కడ స్థిరపడ్డారు. ఒక ప్రత్యేకత విధమైన అరబ్బు-ఇస్లామీ సంస్కృతీ వ్యామోహంతో వారు దేశవాసుల్తో కలిసి పోవడానికి సిద్ధంగా లేరు.

1906లో ముస్లింలీగుపార్టీని ఏర్పాటు చేసుకొని, 1885లో రూపొందిన కాంగ్రెస్‌పార్టీని నిందించడం తమ ధ్యేయంగా పెట్టుకున్నారు. మహ్మదాలీ జిన్నా వారి నాయకుడు. అయినా కొందరు విశాల హృదయులు కాంగ్రెస్‌లో చేరి పోయారు.

బోస్ టిపరాజిల్లాలో సంచరిస్తున్నప్పుడు కాంగ్రెస్ ముస్లింలు ఆయనను ఘనంగా గౌరవించారు. దానికి కన్నుకుట్టి ముస్లింలీగు (ముస్లిం జమీందార్ల

ధనికుల సంస్థవాళ్ళు) సమావేశం జనంపై రాళ్ళు-రప్పలువిసిరి పలువురిని గాయ పరిచారు. బోస్‌కుకూడా దెబ్బలుతగిలి గాయాలైనవి.

ఈట్ కాజవాబ్ ఈంట్‌సే- అనేవాటికి. ఈట్ కాఅద్‌లా పత్తర్‌సే-ఇవ్వగలడు. కాని ఆయన ఉద్దేశ్యం అది కాదు. అన్నాడిలా—

"ఈ ఇటుకరాళ్ళు మమ్ము మా మార్గంనుంచి తప్పించలేవు. దిన దినం మా జనశక్తి ఎలా పెరిగిపోతున్నదో, అలాగే ముస్లింలీగు నిరాశ పాలవుతున్నది. వాళ్ళు ఒకరీతిగా పిచ్చివాళ్ళవుతున్నారు. అయినా మనం వారి ఆవేశాన్ని శాంతితోనే ఎదుర్కొంటాం. వారి గూండాతనాన్ని మన సహనంతో, వారి నిందను ప్రేమతోనే ఎదిరించే సంకల్పాన్ని ఉంచుకొందాం..."

అదీ బోస్‌బాబు హృదయ ఔన్నత్యం.

## కాంగ్రెసుకు గుడ్ బై

రాజకీయ విషయాల పరిశీలనకోసం మళ్ళీ యూరోప్ వెళ్ళినాడు బోసు బ్రిటన్ జర్మనీలమధ్య రగులుతున్న సమస్యలకారణంగా బ్రిటిష్ ప్రధాని ఛైంబర్‌లెను సంధి సంప్రదింపులకోసం జర్మనీ వెళ్ళాడు. దాంతో జర్మనీ బలంముందు బ్రిటన్ తలవంచుతున్నదనే సత్యాన్ని గ్రహించాడు. తిరిగి భారతదేశంరాగానే ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక పోరాట ప్రచారంలో దేశమంతటా తిరిగాడు. ఒకానొక సభలోని బోసు మాటలువిని ఆయన ఆశయంఏమిటో తెల్సుకుందాం.

"ఆరు మాసాల్లో ప్రభుత్వం మనకు సంపూర్ణ స్వాతంత్రం ప్రకటించకపోతే అన్ని శక్తులను ఏకం చేసుకొని భయానకంగా విముక్తి పోరాటాన్ని

ఆరంభించాలి. మన నినాదం ఒక్కటే– ఆంగ్లేయులారా ఇండియాను వదిలిపొండి. అని."

కాంగ్రెసుపార్టీ నాయకుడు చట్టబద్ధంగా సుభాసేఅయినా ఆ ఏడాది కాలంలో శాసన నిర్మాణంలో దాన్ని అమలుపరచడంలో శాంతినేతలు తీవ్రంగా విభేదించసాగారు. బోసు వాటిని అంగీకరించలేదు. తన ధ్యేయాన్ని వదలుకో లేదు.

రెండవసంవత్సరం 1939 త్రిపుర కాంగ్రెస్‌సభల అధ్యక్షస్థానంకోసం మళ్ళీ నిలిచాడు. ఆ క్లిష్ట సమయంలో పోరాటం తీవ్రంకావల్సిన తరుణంలో పార్టీ నాయకత్వం మితవాదుల చేతుల్లో పడిపోవద్దని భావించాడు. ఈసారి గాంధీజీ బోసును తీవ్రంగా వ్యతిరేకించాడు. డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యను బోసుకు పోటీగా నిలిపి ఆయన ఓటమి తన ఓటమిగా పేర్కొని తీవ్ర ప్రచారం కావించాడు. నెహ్రూసైతం గాంధీనే అనుసరించాడు. పోటీ తీవ్రస్థాయికిచేరినా మంచి మెజార్టీతో బోసు నెగ్గాడు. గాంధీజీ అభ్యర్థి పట్టాభికి 1376 ఓట్లువస్తే బోసుకు 1575 లభించాయి. కాంగ్రెస్‌వారితోపాటు గాంధీజీ విచారం పాలయ్యారు

పార్టీ ఆదేశాన్ని తలదాల్చేదేతప్ప పోటీలో నిలవడానికి తనకు ప్రత్యేక ఉత్సాహంలేదని సీతారామయ్య కాంగ్రెస్ చరిత్రలో వ్రాసాడు.

ఇంత జరిగినా బోసు తీవ్ర జ్వరంలోఉన్నాడు. ప్రచారంచేసింది, గెలి పించింది తీవ్రవాద యువకాంగ్రెసు వర్గమే.

ఊరేగింపు ప్రదర్శనలోకూడా బోసుపాల్గొనలేకపోయాడు. బ్రహ్మాండ మైన కాంగ్రెసు ఊరేగింపుముందు బోసు చిత్రపటాలను అలంకరించిన 52



ఏనుగులను నడిపించారు. వాటిమధ్య సుశోభితమైన రథంలో బోసు నిలువెత్తు వర్ణచిత్రాన్నుంచారు. వేలాది యువకులు ఉత్సాహానందాలతో ప్రదర్శనలో పాల్గొన్నారు.

జ్వరంతోఉన్న బోసును కుర్చీలో వేదికపైకితెచ్చినా ఆయన మాట్లాడలేకపోయాడు. ఆయన ఆంగ్ల ప్రసంగాన్ని సోదరుడు శరత్‌చంద్ర చదివి వినిపించగా ఆచార్యనరేంద్రదేవ్ హిందీలో అనువదించాడు.

దాని సారాంశం బ్రిటిష్ రాజరికానికి నిరసనగా తక్షణం సత్యాగ్రహాలు స్వతంత్రపోరాటం తీవ్రం చేయాలని.

కాంగ్రెసుపెద్దల వ్యవహారం బోసుకు ఎంతమాత్రం నచ్చలేదు. ఈయన ఆరంభించే ప్రతిపనినీ వ్యతిరేకించడమే వాళ్ళు ధ్యేయంగా పెట్టుకున్నారు.

కాంగ్రెసు వర్కింగ్ కమిటీ బోసుకు సహకరించక గాంధీజీని నాయకుడుగా చూడ సాగారు, దానితో విసిగి నాలుగుమాసాలకే పార్టీ అధ్యక్షస్థానానికి రాజీనామా ఇచ్చాడు బోసు.

## ఫార్వర్డు బ్లాకు స్థాపన

స్వయంగా ఫార్వర్డుబ్లాకు అనే క్రియాశీల పోరాట సంస్థను ఏర్పరచి దేశమంతా పర్యటించాడు. రాబోయే తీవ్రమైన ఉప్పెనను ముందే పసి కట్టింది ప్రభుత్వం.

సత్యాగ్రహాల ఊపు అధికంచేయడమేకాక, కలకత్తా నగరంలోని ప్రధాన కూడలులలో ఉన్న ఆంగ్లేయ అధికారుల విగ్రహాలను తొలగించే కార్య క్రమం ఆరంభించాడాయన.

సుభాసును వెలుపల ఇలాగేఉంచితే తమ సింహాసనం పడిపోక తప్ప దని భావించి "లేడికి లేచిందే పరుగు" అన్నట్లు ఆయనను ఆంగ్లప్రభుత్వాధికారు తిరిగి బంధించి ఆలీపూర్ జైల్లో ఉంచారు.

స్వతంత్రం మనహక్కు- దాన్ని మనం వీరతతో సాధించుకోవాలి- భిచ్చమడిగి తెచ్చుకోవల్సిన దుర్గతివద్దని ఎంచాడు.

## జైలు నుంచి విడుదల

ప్రపంచం మహాయుద్ధంలో ఉంది. తనదేశం స్వతంత్ర పోరాటంలో

ఉంది. తానేమో చెరసాలలో వ్యర్థంగా పడిఉన్నాడు. బోనులో సింగంవలె బోసు బాబు ఉద్విగ్నుడై ఉన్నాడు. వెలుపలికి వెళ్ళేదెలా?

చివరి ప్రయత్నంగా ఉపవాస దీక్ష ఆరంభించాడు. పాతపాటే. ఆరోగ్యం క్షీణించసాగింది. అధికారులకు కంపరం హెచ్చింది. నీ మరణానికి బాధ్యత నీదేసుమా అని హెచ్చరించారు. అయినా ఆయన దీక్షను విరమింపజేయ లేక పోయారు ఈ వార్త పత్రికలకెక్కింది. ప్రజల్లో వ్యాపించింది. తమ నాయ కుని విడవాలనే అభ్యర్థనలు ఆందోళనలు పెరిగాయి.

బోస్ జైల్లో మరణిస్తే పరిస్థితి విషమించిపోతుందనే భయం ప్రభుత్వా నికి పట్టుకుంది. అధికారుల ఒత్తిడి పెరిగినా పట్టువదలలేదు. "అయితే విడుదల- లేదా యతీంద్రనాథ్‌వలే జైలుగోడలమధ్య ప్రాణాలు అహుతిఇస్తాను" అనే దృఢ సంకల్పంతో ఉన్నారు.

ఆరోగ్యం ప్రమాదకరమని డాక్టర్ నివేదికరాగానే ఒక మాసానికి మళ్ళీ బంధించే షరతుపై బోస్‌బాబును విడుదల చేశారు.

## మానసిక అలజడి

అనారోగ్యంతో గృహబందీగా విశ్రాంతిలోనే అశాంతిగా 1940 సంవ త్సర కాలాన్ని గడిపాడు. ప్రపంచయుద్ధకాలంలో దేశస్వతంత్రపోరాటం తీవ్రిం చేద్దామనుకుంటే కాంగ్రెస్ నాయకత్వం చేజారిపోయింది- ఫార్వర్డ్‌బ్లాక్‌ను నడిపే వీలుకలుగలేదు. అనారోగ్యం అశాంతితో ఎన్నో పగటికలలు కనేవాడు.

దేశమాత కన్నీటితో తనను రక్షించుమని వేడుకుంటున్నట్లు, దుర్గా

మాత అభయహస్తం అందించినట్లు... బెంగాలీకు దుర్గపై ఎనలేని భక్తి అను శీలనసమితి విప్లవకారులకు ఆరాధ్యదైవం. ఏప్రిల్ 13, 1940న ఉద్ధంసింగ్ అనే భారతవీరుడు లండన్‌లో ఒక సాహసకార్యం చేశాడు. జలియన్‌వాలాబాగ్ అమృతసర్ హత్యాకాండకు కారకుడైన సర్ ఓ డయ్యర్ అనే ఆంగ్ల అధికారిని అతని జన్మదేశంలోనే కాల్చి చంపాడు. తర్వాత ఉరిశిక్ష పాలయినా వీరులకు ఉద్రేకం కల్గించాడు.

తాను ఊరికే బందీగా పడివుండడం బోసుకు నచ్చలేదు. రాష్ట్రీయ స్వయం సేవకసంఘ్ వ్యవస్థాపకుడు డాక్టర్ హెడ్గేవార్‌ను పూర్వ పరిచయాన్నిబట్టి జూన్ 40లో కల్సుకోవాలని వెళ్ళాలనుకుని 21 తేదీన ఆయన మరణం చెందిన వార్తవిని విచారించాడంటారు.

## సావర్కార్‌ను కలిశాడు

జూన్ 22 నాడు బొంబాయిలో విప్లవవీరుడు వినాయక సావర్కార్‌ను కలిశాడు. వినమ్రుడై ఆ వీరునికి నమస్కరించాడు. ఆ అనుభవజ్ఞుడు ఈ క్రాంతి వీరుని ఆదరించాడు.

"ఈ యుద్ధకాలంలోనే భారత విముక్తి పోరు సాగించాలి. సైన్యాన్ని రూపొందించుకొని సాయుధ సంగ్రామం నడిపించాలి." అన్నాడు సావర్కార్.

"సాధించిన ప్రయోజనాన్ని స్థిరంగా కాపాడడానికి దేశభక్తుల సంఘం కూడా ఒకటి అవసరం. అదనుచూసి పోరాడే సేనవుండాలి. బయటినుంచి ఆయుధ సహకారం అందుకునే మూడవ నాయక పక్షముండాలి."

బోసు ఆలోచనల పాలయ్యాడు—సావర్కార్ చెప్పుతూ పోతున్నాడు. "ప్రస్తుతం ప్రపంచయుద్ధం వలన బ్రిటన్ కష్టపరిస్థితిలో చిక్కుకొని వుంది. ఈ సమయంలో దూరదృష్టి, తగిన సామర్థ్యం కల మీవంటి నాయకులు దేశంలోనే వుండిపోయి, వీధులలోని బ్రిటిష్‌వారి విగ్రహాల పెకిలించి వేయడంవంటి అల్ప విషయాలపై ఆందోళనచేసి చెరలో మ్రగ్గిపోవడంలో అర్ధమేమైనా వుందా...

వేలాది ఆంగ్ల పాలకులు ఈనాడు దేశాన్ని పీడిస్తూ వుండగా ఎన్నడో గతించిపోయిన బ్రిటిష్ దౌర్జన్యకారుల శిలా విగ్రహాలు తీసివేయడంలో ప్రజల శక్తి వ్యర్థమైపోదా? మీవంటి నాయకులు జైళ్ళకు వెళ్ళటం మనకు మనమే శత్రువులై పనిచేసినట్లు కాలేదా? సాధ్యమైనంత వరకు శత్రువులను బందీలుగా చేయడంలో నిజమైన రాజనీతి వుందికాని, తమ్ము తాము బందీలుగా చేసుకోవడంలో లేదు. చూడండి సుభాస్ ! మీకు విప్లవకారులతో చిరకాలంగా సంబంధాలున్నాయి. ఒక్క విషయం మీతో చెప్పాలనుకుంటున్నాను. నేను దేశ వ్యాప్తంగా సాగించి వాలవరకు సఫలమైన సైనికీకరణ ఆందోళనకు మూలం విప్లవోద్యమమే."

రాసబిహారీ లేఖను సైతం చూపాడు.

"రాసబిహారీ వంటి అనేక విప్లవకారులు భారతదేశంనుంచి బ్రిటిష్‌వారి కళ్ళల్లో దుమ్ముచల్లి జపాన్ జర్మనీవంటి దేశాలకు వెళ్ళినట్లుగానే మీరు కూడా ప్రభుత్వం కళ్ళుగప్పి దేశంనుంచి వెళ్ళిపోండి అక్కడ ఇటలీ జర్మనీ చేతుల్లో చిక్కిన వేలాది భారత సైనికులకు నాయకత్వం వహించండి. హిందూ దేశం స్వాతంత్ర్యం పొందిందని ప్రకటించండి. జపాన్ యుద్ధంలో దిగటంతోనే అను వైన మార్గంద్వారా, బంగాళాఖాతంద్వారా కాని, బర్మానుంచిగానీ హిందూస్థాన్‌లోని

బ్రిటిష్ రాజశక్తిపై బయటినుంచి దాడిచేయండి. ఇటువంటి సాయుధ సాహసం విక్రమం లేకుండా హిందూదేశాన్ని స్వతంత్రం చేయలేము. ఇటువంటి సాహసం చూపగలవారు నా దృష్టిలో ఇద్దరు ముగ్గురే వున్నారు. వారందరిలోకూడా నీకు ప్రత్యేక యోగ్యత వుందని నా అభిప్రాయం."

సుభాస్ లేచి "మొదట కలకత్తా వెళ్ళి తర్వాత భావి కార్యక్రమం నిశ్చయించుకుంటాను-" అని వెళ్ళివచ్చాడు.

ఏదో పూజలో కూర్చున్నట్లు మౌనంగా వుండటం ఆరంభించాడు. రోజుల తరబడి గది తలుపులు మూసే వుండేవి. భోజనపు పళ్ళెం తలుపుక్రిందుగా లోపలికి త్రోసేవారు.

16వ తేదీ పళ్ళెం ఆలాగే వుంది. వారం రోజులు వేచి చూశారు. ఉప వాస నియమమేమో అనుకున్నారు. తర్వాత పోలీసులకు తెలిపారు. వారు వచ్చి తలుపులు తెరిచి చూస్తే ఏముంది?

బోసుబాబు పరారీ. ఎప్పుడు? ఎలా?

ఈవార్త 27 జనవరినాడు దేశమంతటా గుప్పుమని వ్యాపించింది. అనేక కథలు వ్యాప్తిలోకి వచ్చాయి.

## పరారీ

బోసు పరారీని గూర్చి నా.వి. కాకత్‌కర్ 'స్వతంత్ర సమర జ్వాలలు' లో వ్రాసిన భాగం చూద్దాం.

1941 జనవరి 16వ తేదీ రాత్రి 8 గంటలవేళ చుట్టూ చీకటి క్రమ్ముకొని వున్న వేళ కాపలా పోలీసులు, గూఢచారులందరూ నిద్రమత్తులో వున్నారు. సుభాస్‌బాబు ఇంటినుండి ఒక పఠాన్ బయటికి వచ్చాడు. అక్కడ సిద్ధంగా వున్న లారీలో కూర్చుని పేషావర్ దిక్కు ప్రయాణం సాగించాడు. అతడు జివా ఉద్దీన్ అని పేరుపెట్టుకున్నాడు. స్నేహితుడు భగత్‌రాం తోడుగా వున్నాడు కాబూలు వైపు సాగిపోతూ భాష విషయంలో ఇబ్బంది కలుగగా మూగ, చెవిటివాడుగా నటించసాగాడు. ఇద్దరూ యెన్నో కష్టాలు అనుభవించి నది దాటి కాబూలు నగరం చేరుకున్నారు. ఇదంతా అయిదురోజుల ప్రయాణం. అక్కడ ఉత్తమచంద్ అనే వ్యాపారి ఈ పఠాన్‌కు ఆశ్రయమిచ్చాడు. అక్కడనుండి ఇటలీ కార్యాలయంతో



సంబంధం ఏర్పరచుకొని, వారి సహకారంతో మాస్కో చేరుకున్నాడు మన పఠాన్ సుభాస్‌బాబు.

బెర్లిన్-హాంబర్గులమధ్య హిట్లర్ సుభాస్‌ను కల్సుకున్నాడు"

"ఆ రాత్రి మేనల్లుడు శిశిరబోసు సాయంతో గోమో చేరుకొని మరో వ్యక్తితో పేషావర్ ప్రయాణం సాగించాడు." అని 'పడాల' 'విప్లవ వీరయుగం' లో వుంది.

మార్చి 18కి కాబూలుదాటి 20కి మాస్కోచేరి జర్మనీ కార్యాలయములో సంప్రదింపులు జరిపి 28న బెర్లిన్ చేరాడట.

## జర్మనీలో హిట్లరును కలిశాడు

సుభాస్ చేతితో చేయి కలిపి "మీరు ఇక్కడికి క్షేమంగా రావటం మాకు చాల ఆనందంగా వుంది" అన్నాడు హిట్లర్.

ధన్యవాదాలు తెల్పి తన హృదయం విప్పాడు బోసు.

"ఈ సమయంలో భారత స్వతంత్రత కోసం ఏ మార్గాన్ని ఎన్నుకోవాలో తెల్సుకోగోరుతున్నాను. నేను మానసికంగా అలజడిలో వున్నాను. మా దేశ నేతలు ఈ విషయంలో నాతో భిన్నంగా వున్నారు. వారు అహింస అని అరుస్తున్నారు. బ్రిటిష్ ప్రభుత్వం వారి కోరికను తీరుస్తుందనే ఆశ నాకు లేదు. మీతో యెలా విశ్వాసఘాతుకంగా ప్రవర్తించిందో మాతోనూ అంతే చేస్తుంది. మీ ఆలోచన ఎలాగుందో మరి"

"మీరు క్రితంలో వచ్చినప్పుడు ఆంగ్లేయుల స్వభావాన్ని గూర్చి ఏం వివరించారో ఇప్పుడదే అనుభవంలోకి వచ్చింది. అందుచేత ఆయుధాలు పైకెత్తంది స్వేచ్ఛ నశించడం వ్యర్థం."

"ఒక సాయుధ సేన, పుష్కలంగా ఆయుధ సామగ్రి, క్రాంతికారుల తోడ్పాటులేనిది ఆశయం పూర్తికాదని నా భావన"

"నా ఉద్దేశ్యంలో మీరు విదేశీ బలాల తోడ్పాటుతో బయటనుంచి సరి హద్దులపై దండెత్తాలి"

"ఆ భావనలోనే నేను మీ సాయాన్ని కోరుతున్నాను"

"అన్ని విధాలా సహకారం నానుంచి మీకుంటుంది. విచారించదగిన విషయమేమంటే భారత సేనలోని 10వ, పటాలం లిబియాలో మా జర్మనీ సేనకు విరుద్ధంగా పోరాడుతున్నది."

"నేను సత్వరం భారత సేనకు నా సందేశాన్ని పంపిస్తాను. వారిముందు వాస్తవ విషయాన్ని వుంచి మీ సేనలతో యుద్ధం చేయవద్దంటాను. వారు నామాట అంగీకరిస్తారని నా విశ్వాసం"

సుభాస్ మాటలపై హిట్లర్ విశ్వాసముంచాడు. వారి ఆలోచన ఫలించింది. తర్వాత బోసు ఇటలీ వెళ్ళాడు. అనేక దేశాల ఉన్నతాధికారులనుకల్సి హిందూదేశ స్వాతంత్ర్యం కోసం సహాయాన్ని కోరి వారి సానుభూతిని సంపాదించుకున్నాడు. రోములో ముస్సోలినీతో మాట్లాడి తిరిగి జర్మనీకి చేరాడు. బ్రిటన్ పక్షంగా నిలిచి జర్మనీతో పోరాడుతున్న భారత సైనికులకు ఈ వర్తమానం పంపాడు.

"నేను జర్మనీ చేరుకున్నాను. మీతో నాకు పెద్ద వ్యవహారం వుంది. ఈ యుద్ధం మనదికాదని మీరు తెల్సుకోవాలి. బ్రిటన్, జర్మనీల మధ్య జరుగుతున్న ఈ పోరాటంతో మనకేమీ సంబంధంలేదు. మీరు ఈ యుద్ధాన్ని ఆపుచేయవల్సిందిగా నేను కోరుతున్నాను సుభాశ్చంద్రబోస్"

## ఆజాద్ హిందూ సేన ఏర్పాటు

బోసుబాబు సందేశం అంశాలు భారత సైనికులపై మంచి ప్రభావాన్ని కలిగించినై. వారికి ఆంగ్లేయులపై మంటగానే వుంది. 20 లక్షల భారత సేనలో ఏ ఒక్క అధికారి భారతీయుడుకాడు. మరి వీరంతా భారత సిపాయిలు ఆంగ్లేయులకు ఏమాత్రం తీసిపోయేవారుకారు. అయినా వీరికి వారితో సమాన గౌరవం పదవులు, వేతనాలు లభించేవి కావు.

వెంటనే ఆపరాని ఉత్సాహంతో భారతసేన ఆంగ్లసేననుంచి వేరుపడి జర్మనీతో సంధికి పూనుకుంది. భారత కర్నల్ హసిన్అలీ, జర్మనీ సేన కమాండర్తో సంధి చేసుకున్నాడు. ఆ వార్త వైర్లెస్ ద్వారా విని సుభాస్ యుద్ధస్థలానికి చేరుకొని భారతసేన సహృదయతకు ధన్యవాదాలు తెలియజేసి ఆ సేనకు నాయకత్వం వహించాడు.

డ్రెసెయిన్ కేంద్రంగా 45 వేల భారత సైనికులతో "ఆజాద్ హిందూ ఫౌజు"ను సుభాసు స్థాపించాడు. నూతన స్వతంత్ర సేనను ఉద్దేశించి ఇలా ప్రసంగించాడు-

"మిత్రులారా! జ్ఞాపకముంచుకోండి. బ్రిటన్ మనకు అలాగే జర్మనీకి రెండు దేశాలకు శత్రువు. మనం జర్మనీ తోడ్పాటుతో మన స్వేచ్ఛా పోరాటానికి సంసిద్ధం కావాలి" జాతీయ జండాను ఎగురవేసి "మనం ఈ మన రాష్ట్రీ పతాకాన్ని విలువైనదిగా భావించుదాం. దీన్ని ఎట్టి పరిస్థితులలోనూ పైకి ఎగిరేటట్లుగా చూడాలి" అన్నాడు.

ఆజాద్ హిందూ సేనను చూసి ముగ్ధుడై జర్మనీ నేత హిట్లర్ దానికి అన్ని సౌకర్యాలను కల్గించాడు. స్వతంత్ర హోదా కల్పించాడు. ఒక సొంత రేడియో స్టేషన్‌ను పైతం ఏర్పరచి ఒప్పగించాడు.

బోసును ప్రశంసించాడు. హిట్లర్ గౌరవార్థం బోసు సైనిక వందనం ఏర్పాటుచేశాడు. అప్పుడు హిట్లర్ ఇలా అన్నాడు.



"మహాభారత నివాసులారా!

మీరు ధన్యులు. మీ నేతాజీకూడా ధన్యులు. మీ నేతాజీ స్థానం నాకంటె చాల వున్నతమైంది. నేను కేవలం ఎనిమిదికోట్ల జర్మనీయులకు నాయకుడను. కాని వారు నలుబదికోట్ల భారతీయులకు దాయకుడు. అన్నివిధాలా వారు నాకంటె గొప్ప నాయకులు. నేను మరియు నా జర్మన్ సైనికులు వారికి వందనం చేస్తాము. నేతాజీ నాయకత్వంలో విశాలభారతం ఒకరోజున తప్పక స్వతంత్రం పొందుతుందని నాకు సంపూర్ణ విశ్వాసముంది"

బెర్లిన్ రేడియోకేంద్రంనుంచి సుభాస్ దృఢనిశ్చయంతో సమస్త విశ్వానికి భారతీయులగురించి ఇలా ప్రసంగించాడు.

"మాకు మా విజయంపై సంపూర్ణ విశ్వాసముంది.మా భారతభూమిపై మాకు అధికారముంది. మేము స్వయంగా దేశ భాగ్యవిధాతల స్థానాన్ని పొందు తాం...భారతదేశంలో ఏ ఒక్క వ్యక్తికానీ జీవించి వున్నంతవరకు మా అధికారం నిలిచివుంటుంది...ఈ అధికారంతోపాటు ఆత్మవిశ్వాసబలంతో ఒక విషయాన్ని ప్రకటిస్తున్నాం. మేము సంపూర్ణ స్వతంత్రులం. మా ప్రాణాలతో చెలగాటమాడి మా దేశాన్ని స్వతంత్రపరుస్తాం, దాని పేరుకు ప్రపంచంలో మచ్చ రానీయం. మా ఆయుధబలంతో ఒక్కొక్క విదేశీ వ్యక్తిని దేశంనుంచి బయటకు తరిమివేసే వరకు నిశ్చింతగా వుండం"

ఈ వార్తాప్రసారంతో మలయా, జపాన్, సింగపూర్, బర్మా, భారత్ మొదలగు దేశాల్లో వున్న భారతీయుల్లో క్రాంతి అగ్నికణాలు ప్రజ్వలించాయి.

## ప్రపంచ యుద్ధ పరిణామాలు

1939లో ప్రపంచయుద్ధం ఆరంభమయింది. అది యూరప్‌నుంచి ఆశియాలో ప్రవేశించింది.

1941లో జపాన్, మలయా, డచ్, ఈస్టిండియాలను ఆక్రమించు కొంది.

1942లో విచిత్రంగా బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లో ఉన్న సింగపూర్ జపాన్‌కు స్వాధీనపడిపోయింది. బ్రిటిష్ సేనల బలహీనతవల్ల జపాన్ బర్మాను జయించి భారత భూభాగంలోకి ప్రవేశించింది.

అటు జపాన్ రాజధాని టోక్యోలో భారత క్రాంతికారి రాస విహారి బోసు స్వతంత్ర భారత నాయకుల సమావేశం ఏర్పాటుచేశాడు. మలయా, సయాం, ఇండోచీనా, జపాన్ మొదలగు దేశాల్లోని భారత ప్రతినిధులు అందులో పాల్గొని విచారంతో చర్చలు కావించారు.

మూడు రోజుల సమాలోచనల అనంతరం రాసబిహారి అధిపత్యంలో "భారత స్వతంత్ర సంఘం"ను ఏర్పరిచారు.

అనుకున్న ప్రకారం సయాం రాజధాని బ్యాంకాంగ్‌లో భారతీయుల సమావేశం జరిగింది. మలయా, జావా, సుమిత్రా, ఇండోనేషియా, బోర్నియో, హాంకాంగ్ మున్నగు దేశాల ప్రతినిధులు అందులో పాల్గొన్నారు.

రాసబిహారి బోసు ఆ సభలోనూ పాల్గొని "స్వతంత్ర సంఘ" నిర్మా

ణం కావించాడు. భారత స్వాతంత్ర్య విజయంకోసం పోరాడటం ఆ సంస్థ లక్ష్యం దానికి కార్యకర్తలను ఎన్నుకున్నారు. కాంగ్రెసు జెండానే తమ స్వతంత్ర పోరాట పతాకంగా ఎంచుకున్నారు.

కొద్దికాలానికే ఆ సంఘం బలమయిన శక్తిగా రూపొందింది. కెప్టెన్ మోహన్‌సింగ్ ఆధిపత్యంలో భారత సేనలు దానితో కలిశాయి.

ఆంగ్ల సేనల ఓటమితో ఆరువేల భారత సేన జపాన్‌వారి వశమైంది. వారి పోషణ కష్టమై జపాన్ ఆ సేనలను మోహన్‌సింగ్‌కు ఒప్పగించింది. అది వారికి మేలే అయింది. సేనతోపాటు మిలటరీ అధికారులు స్వాధీనపడ్డారు.

1942 చివరలోనూ స్వతంత్ర అధికార విషయంలో భారత సేనా నాయకులకు జపాన్‌వారితో విభేదాలు కలిగాయి.

రాసబిహారీ, గిలానీ, రాఘవన్ మొదలగు భారత వీరులు ఈ విషయములో విచారం పొందారు. స్వేచ్ఛా పోరాటానికి జాప్యం జరుగుతున్నది. జపాన్ భారత సేనకు స్వేచ్ఛాధికారాలు ఇవ్వడానికి వెనుక ముందాడుతున్నది. ఈ వర్తమానం జర్మనీలో వున్న బోసుబాబుకు చేరింది.

## సుభాష్ టోక్యో పయనం

భారత స్వతంత్ర సంఘానికి, భారత విముక్తి సేనకు మధ్య అభిప్రాయభేదాలు వచ్చినట్లు, తక్షణం వచ్చి పరిస్థితులు సర్ది పోరాటాన్ని సాగించవల్సిందిగా బోసును రాసబిహారీబోసు కోరాడు.

తన ప్రయాణానికి ముందు తన స్వతంత్ర సేనతో, హిట్లర్‌తో వీడ్కోలు పొంది, కర్నల్ హసన్‌ను తోడుగా తీసుకొని విమాన ప్రయాణంతో టోక్యో చేరుకున్నాడు. రాస బిహారీ బోసు ఇతర భారత ప్రతినిధులు బోసుకు గౌరవపూర్వక స్వాగతం చెప్పారు.

కొన్ని వారాలు అక్కడేవుండి అనేకులతో సంప్రదించి పరిస్థితులు చక్కపరచాడు బోసు వాగ్ధోరణికి, చిత్తశుద్ధికి షరతులు అన్నీ అంగీకరించాడు జనరల్ రోజో. పత్రికా విలేకరులతో ఇలా అన్నాడు—

"ఈ ప్రపంచ యుద్ధకాలంవంటి సదవకాశం మరో పదేండ్లకు కానీ మాకు రాదేమో కాబట్టి దీన్ని భారత విముక్తికోసం పూర్తిగా వుపయోగించు కోవాలని నా ఉద్దేశ్యం. ఆయుధాలను పైకెత్తిన శత్రువులను ఆయుధాలతోనే మన రక్తాన్ని ధారపోసి ఎదిరించడం సముచితం."

ఇది తూర్పు ఆశియా వీర సైనికులను బాగా ఉత్తేజపరచింది అప్పటికి మలయాలోనే స్వతంత్ర సంఘ సభ్యుల సంఖ్య లక్ష ఇరవై ఐదువేలు. ఆజాద్ హిందూ సేనలో అప్పుడు ఉత్సాహంతో స్వేచ్ఛగా ముందుకు వచ్చి చేరినవారు యేబదివేలు.

బోసు టోక్యోనుంచి బెర్లిన్ వచ్చి ఒక సబ్‌మెరైన్‌లో సింగపూర్ చేరుకున్నాడు.

"మిత్రులారా! వీర సైనికులారా-మీ యుద్ధ నినాదం ఒక్కటే- ఢిల్లీ చలో-" అని హెచ్చరించాడు.

"మొదటి ప్రపంచయుద్ధంలో ఆంగ్లేయులు భారతీయులను మోస గించారు. తిరిగి వారికిప్పుడు అలాంటి అవకాశం ఇవ్వకూడదు. మనదేశం ఎలాంటి సువర్ణ అవకాశంకోసం గతంలో ఎదురుచూస్తూ వుండిందో అది వచ్చేసింది. మన సర్వస్వాన్ని అర్పించి స్వాతంత్ర్యం సంపాదించుకోవాలి. కత్తికి జవాబు కత్తి తోనే చెప్పాలి. సామ్రాజ్యవాద చితిపైన స్వతంత్ర భారతం జన్మిస్తుంది. విజయం సాధించేవరకు మనం పురోగమించాలి"

జపాన్ ప్రభుత్వం సుభాస్‌కు సంపూర్ణ సహకారం హామీ ఇచ్చింది. భారత దేశవాసులకు బోస్ ఇచ్చిన సందేశం.

"నాకు తెల్సు, నా దేశీయులు కొందరు ఆంగ్ల సంస్థలతో ఆంగ్ల ప్రభుత్వ ప్రభావానికి లోనైనారు. వాళ్ళు భయానికి లోబడినారు. భారతీయులంతా నాపై విశ్వాసముంచవల్సింగా కోరుతున్నాను. బ్రిటిష్ ప్రభుత్వ శక్తి నన్ను పదకొండుసార్లు నా జీవితకాలమంతా ఖైదులో వుంచింది. అయినా జీవిత ధ్యేయాన్ని భంగపరచలేకపోయింది. ఆటవిక కపట శక్తుల్తో బ్రిటిష్ ప్రభుత్వం నన్ను కష్టపెట్టిన రీతిలో ప్రపంచంలో మరే దేశమూ ప్రవర్తించలేదు. దేశం లోపల బయటా శత్రువులను వ్యతిరేకించే భారతీయులంతా ఇప్పుడు ఏకమై బల మైన పోరాట సంఘాన్ని రూపొందించుకోవాలి.

మిత్రులారా! అవసరాన్నిబట్టి నేను ఇంకా నావంటి అనేకులు కష్టాల్లో యుద్ధాల్లో మీ వెంటనే వుంటాం. అందరంకల్సి విజయ ఉత్సాహంలో భాగం పంచు కుందాం. భారత్ త్వరలోనే స్వతంత్రం పొందుతుంది. స్వతంత్ర భారతంలో

బందీగృహాల తలుపులు తెరువబడతాయి. ఇన్నాళ్ళు చీకటి గోడలమధ్య గడిపిన వీరులంతా విముక్తదేశపు ప్రకాశంలోకి అడుగుపెట్టి ఆనందిస్తారు.

విప్లవం వర్ధిల్లాలి. ఆజాద్ హింద్ జిందాబాద్"

## సైనికులకు సందేశం

రాస బిహారీ బోసును కల్సుకొని, ఆ తర్వాత సింగపూర్ సైనికులను కల్సుకొని మాట్లాడాడు.

"భారత స్వతంత్ర వీరులారా! ఈ దినం నా జీవితంలో సర్వోత్తమ



మైనది, గౌరవప్రదమయినది. భారత స్వతంత్ర సేన నిర్మాణం జరిగిందని తెల్పుటకు ఆనందిస్తున్నాను. దేశ స్వతంత్రం దీనివల్లనే సాధ్యం.

సుఖ దుఃఖాల్లో నేను మీ వెంటనే వుంటాను. ఆకలిదప్పులు పోరాటం కన్నా మీకిప్పుడు వేరుగా ఏమీ ఇవ్వలేను.

భారత స్వేచ్ఛను చూడడానికి మనలో ఎవరం బ్రతికివుంటామో తెలియదు. దేశం స్వతంత్రం పొందడం మాత్రం నిశ్చయం. దానికోసం మన సర్వస్వాన్ని అర్పిద్దాం. భగవంతుడు మన సేనను ఆశీర్వదించాలి. మనకు యుద్ధ విజయం కలిగించాలి.

విప్లవం వర్ధిల్లాలి! ఆజాద్ హిందూఫౌజ్ జిందాబాద్!"

సభలోని వీరులంతా తమకు సరియైన నాయకత్వం లభించిందని సంతసించారు. నేతాజీకి సైనిక వందనం చేశారు. జపాన్ పెత్తనం సాగవద్దు. స్వతంత్ర భారత రాష్ట్రపతి నేతాజీ కావాలని సైనికులు సూచించారు. ఇప్పటినుంచే బోసుకు 'నేతాజీ' పేరు స్థిరపడిపోయింది.

"స్వతంత్ర భారత ప్రజలు తమకు నచ్చినవారిని రాష్ట్రపతిగా చేసుకొనవచ్చును. నేను కేవలం స్వరాజ్య సేవకుడను మాత్రమే" అన్నాడు బోసుబాబు.

## ప్రజల సహకారం లభించింది

సింగపూర్‌లోని ఒక మహాసభలో మూడులక్షల సేన, ముప్పదికోట్ల

డాలర్లు అర్థించాడు నేతాజీ. 1857 నాటి ప్రథమ భారత స్వతంత్ర పోరాట వాతావరణం నెలకొంది.

బోసుబాబు అభ్యర్థనకు ప్రేరణపొంది విదేశ భారత వ్యాపారులు ధన రాసులను బోసు పాదాలముందు రాసులుగా పోసారు. పెద్ద మొత్తంలో డబ్బు జమ అయింది. వీరయువకులతోపాటు వీరనారీమణులుకూడా వేలసంఖ్యలో వచ్చి స్వతంత్ర సేనలో చేరారు.

ఒక్కటే నినాదం-విప్లవం వర్ధిల్లాలి!

## ఆజాద్ హిందూ సేన ముందడుగు

విప్లవ సైన్య సేనాధిపతిగా పోరాటసేనకు 25 ఆగస్టు 43 నాడు నేతాజీ యుద్ధ సందేశాన్ని ఇచ్చాడు.

ఆజాద్ హిందూ సేనకు మరియు స్వతంత్ర ఆందోళనకు సర్వ సేనాధిపత్య బాధ్యతను తనకు ఒప్పగించినందుకు కృతజ్ఞతలు తెలిపాడు. కర్తవ్య పాలన, దేశభక్తి సంపూర్ణంగా వున్న తమ సేనవల్ల విజయం తప్పక లభిస్తుందని ధైర్యం చెప్పాడు.

రంగూన్‌లో ఢిల్లీ చివరి ప్రభువు బహద్దూర్‌షా స్మృతి దినం జరిపి శ్రద్ధాంజలి ఘటిస్తూ అన్నాడిలా.

"మనం భారతీయ మత విశ్వాసాలను దూరంగా వుంచి బహదూర్‌షాను జ్ఞాపకం చేసుకుందాం. ఆయన ఆంగ్లేయులతో పోరాటానికి 1857 దేశ పురుషులను

ఆహ్వానించినందుకుకాదు. ఆ జండా నీడలో అన్ని ప్రాంతాల, అన్ని మతాల-అభిప్రాయాల ప్రజలు నిలిచి పోరాడినారు. ఆ పురుషుని పతాకంక్రింద హిందువులు, ముస్లింలు, సిక్కులు కలసికట్టుగా స్వతంత్ర పోరాటం సలిపారు. బహదూర్ షా స్వయంగా అన్నాడిలా—

"భారత స్వతంత్ర పోరాట వీరుల హృదయాల్లో అంతిమ విశ్వాస కణం ఉన్నంతవరకు భారతఖడ్గం పోట్లు లండన్ గుండెలను ఛేదిస్తూనే వుంటాయి."

బోసుబాబు బాధ్యత పెరిగింది. తుఫానులా సంచరిస్తూ సైన్య పోరాట కార్యక్రమాలను పర్యవేక్షింపసాగాడు.

## స్వతంత్ర భారత ప్రభుత్వ స్థాపన

"తూర్పు ఆశియా భారత స్వతంత్ర సంఘం ద్వారా తాత్కాలిక అజాద్ హింద్ ప్రభుత్వం యేర్పడింది. ఆ శ్రమ మనది. ఈ ప్రభుత్వాన్ని ఏర్పరచుకొన్నంత ఉన్నత భావంతో మన కర్తవ్యాలను పూర్తిచేసుకుంటూ ముందుకు పోవాలి.

ఈ నూతన ప్రభుత్వం ప్రతి పౌరునికి మత స్వాతంత్ర్యంతోపాటు సమానాధికారం, సమాన సౌకర్యాలు కల్గిస్తుందని హామీ ఇస్తున్నది. దేశంలోని ప్రతి వ్యక్తికి సుఖసంతోషాలను సమానంగా కల్పించడానికి, రక్షించడానికి ప్రతిన తీసుకుంటున్నది. విదేశీ ప్రభుత్వంతో వ్యాప్తి చేయబడిన భేదభావాలను, మోసాన్ని దమననీతిని దూరంచేసి సర్వత్రా శాంతిని స్థాపించడాన్ని ప్రకటిస్తున్నది."

నేతాజీ ప్రకటన తర్వాత లక్షలమంది భారతీయులు ఆజాద్ హిందూ ప్రభుత్వ నిబంధనల పత్రంపై సంతకాలు చేసారు.

బోసుబాబు సైనిక వందనం స్వీకరించాడు.

అతికొద్ది కాలంలోనే జపాన్, ఇటలీ, జర్మనీ, ఫిలిప్పైన్స్, క్రోసియా మంచూరియా, బర్మా, థాయ్‌లాండ్ మొదలగు దేశాలు నూతన స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని గుర్తించాయి.

సైన్యాన్ని అయిదు భాగాలు చేసాడు. గాంధీ, నెహ్రూ, ఆజాద్, నేతాజీ పటాలాలు పురుషులవి. ఝాన్సీ రెజిమెంట్ స్త్రీల విభాగం. మహిళాదళానికి కెప్టెన్ లక్ష్మి నాయకురాలు.

ఆజాద్ హింద్ ప్రభుత్వం మొట్టమొదటిసారిగా అమెరికాపై యుద్ధాన్ని ప్రకటించినప్పుడు యావత్ప్రపంచం ఆశ్చర్యపడింది.

## జైత్ర యాత్ర

బ్రిటిష్‌వారినుండి గెలుచుకున్న అండమాన్ నికోబార్ భారత ద్వీపాలను జపాన్ నూతన ప్రభుత్వానికి ఒప్పగించింది. అదే వీరి మొదటి స్వతంత్ర భారత భూభాగం. అండమాన్ అజన్మ ఖైదుశిక్షలు పొందినవారికే కాక సావర్కార్ తిలక్ వంటి ఎందరో ప్రముఖ దేశనాయకులు బందీలుగా వుంచబడిన ప్రాంతం. అక్కడి కారాగారం తలుపులు తెరువబడ్డాయి. ఆనందోత్సాహాలతో ఆ ఖైదీలు నూతన స్వతంత్ర ప్రభుత్వానికి స్వాగతం చెప్పి, సైన్యానికి తోడుగా నిలిచారు.



అక్కడ నూతన ప్రభుత్వపాలన నెలకొంది. అక్కడ బందీలుగా మరణించిన పోరాటవీరుల జ్ఞాపకార్థం అండమాన్‌ను 'అమరవీరుల ద్వీపం' అని, నికోబార్‌ను "స్వరాజ్యదీపం" అని పేర్లు పెట్టారు.

30 డిసెంబర్ 1943కు నేతాజీ అక్కడికి చేరుకున్నాడు.

ఆయన ఆనందం వర్ణనాతీతం. తన కలలు నిజమౌతున్నవి. దేశం ముక్తి పొందుతున్నది. సేనాని లోకనాథన్‌కు అక్కడి పరిపాలన అప్పగించి రంగూన్ వెళ్ళాడు. 44 జనవరి 26న స్వాతంత్ర్యదినం ఘనంగా జరుపుకొన్నారు. మహోత్సాహంతో సేనలు ముందుకు సాగుతున్నాయి.

ఆయన కోరిందే తడవుగా వేలు, లక్షలు విరాళాలతో కోట్ల డబ్బు

ప్రోగయింది. స్త్రీలు తమ ఆభరణాలిచ్చారు. పురుషులు కొందరు యావదాస్తులను సమర్పించారు. వారి ఉత్సాహం, దేశభక్తి అలాంటివి

భారతదేశపు సరిహద్దులపై బర్మావైపునుంచి దాడి ఆరంభమయింది. 'జియావాడి' ఎస్టేటువారికి స్వాధీనమయింది.

ఇరవై వేల సేన కెప్టెన్ షానవాజ్‌ఖాన్ నాయకత్వంలో ముందుకు సాగింది. ఆజాద్ హిందూసేన పరాక్రమానికి బెదరి ఆంగ్లసేన పారిపోయింది. మార్చి 8వ తేదీన మణిపూర్ వశమైంది. ప్రజలు సంతోషంతో సగర్వంగా తలలెత్తి స్వతంత్ర సేనకు స్వాగతం పలికారు. వీరులు విజయోత్సాహంతో ముందుకు నడిచారు. క్రమంగా ఇంఫాల్, మెరాయీ, కోహిమా, కాలందర్, టిట్టిం, పాలేర్ రణరంగాలై విజయాలు లభించినై. భారత జాతీయ జండా ఆ ప్రదేశాల్లో పైకెగిరింది.

## స్వతంత్ర ప్రభుత్వ బ్యాంకు స్థాపన

స్వతంత్ర పోరాటంలో ఆ భారత వీరులు ఆకలిబాధలకు తట్టుకోలేక పలుసార్లు అడవి గడ్డిని సైతం తినవల్సివచ్చింది. అయినా ప్రాణాలను లెక్క చేయక అజేయంగా పోరాడుతూ విజయాలు సాధిస్తూనే వున్నారు.

విమాన సేన లేక వారికి సౌకర్యాలు అందించడం కష్టమైంది. ఈ దయనీయ పరిస్థితికి సుభాస్ యెంతగానో చింతించాడు.

బర్మాపై అధికారం లభించిన తర్వాత బోసుబాబు రంగూన్‌లో ఒక జాతీయ బ్యాంకును ఏర్పాటుచేశాడు. ఆ బ్యాంక్ మూలనిధి కోసం ఒక రంగూన్

ముస్లిం ముప్పది లక్షల రూపాయలిచ్చాడు. బర్మా ప్రభుత్వ పద్ధతిలో ఆ బ్యాంక్ రిజిస్ట్రేషన్ జరిగింది. దాని చెక్కులు కరెన్సీ నోట్లతో సమానంగా చలామణి అయినవి.

విదేశ భారతీయుల్పై పన్ను విధించబడింది. తమ ఆదాయంలో పదవ వంతు పన్ను ప్రభుత్వానికి చెల్లించాలని వ్యాపారుల సంఘం నిర్ణయించుకుంది. అలా ఎనిమిదికోట్ల రూపాయలు బర్మాలో వసూలయినవి. అందులో మూడున్నర కోట్ల రూపాయల సామాను సైనికులకోసం పంపించారు.

## ఆజాద్ హింద్ పత్రిక ప్రకటన

ఒకటి ఆంగ్ల పత్రిక, ఒకటి రోమన్ లిపిలో వున్న హిందీ పత్రిక అప్పుడప్పుడు మద్రాసు ఆంధ్ర ప్రజలకోసం దక్షిణ భారత భాషా సంచికలు ప్రచురించసాగారు. పత్రిక పైభాగాన పెద్ద అక్షరాలతో-ఏకత, విశ్వాసం,బలిదానం అని ఉండేది. దానిక్రింద Organ of the Indian independence leage head quarters అని వుండేది. హిందూస్థాన్‌కు జయము. కూటికి గుడ్డకు కరువైన నల్లభై కోట్ల భారత ఆత్మలకు జయము-ఇలా నినాదాలుండేవి. 'జైహింద్' అనేది విలువైన పదం.

సేనలు అరకాన్ చేరినప్పుడు సుభాస్ ఇలా హెచ్చరించాడు.

"దూరం చాల దూరం! ఈ నదీ వనారణ్యాల్తో పచ్చని భూభాగంలో పర్వత శిఖరాలు, నదీనదాలతో నిండిన మనదేశముంది. మనం జన్మించిన ఆ స్థలానికే తిరిగి మనం చేరునుంటున్నాం.

వినండి భారతదేశం మనలను పిలుస్తున్నది, భారత రాజధాని మనలను పిలుస్తున్నది. ముప్పది ఎనిమిదికోట్ల తొంబదిలక్షల భారతీయులు మనలను పిలుస్తున్నారు. మన తల్లులు, బంధువులు పిలుస్తున్నారు. లేవండి! సమయాన్ని వృథా చేయవద్దు. ఆయుధాలు పైకెత్తండి.

అదుగో చూడండి. మీముందు మార్గం తెరచివుంది...మనం ఆ దారి గుండానే ముందుకు వెళ్ళాలి. శత్రుసేనల చీల్చుకొని మనం మన మార్గాన్ని రూపొందించుకుందాం.

కదం కదం బఢాయె జా-ఖుషీకె గీత్ గాయె జా
యె జిందగీహై కౌమ్‌కీ-తూ కౌమ్ పె లుటాయె జా..."

## అమర వీరుల స్మృతి చిహ్నం

సింగపూర్‌లోని ఏ స్థలంలోనయితే ఆజాద్ హిందూ ఫౌజ్ నిర్మాణం జరిగిందో, సముద్రతీరంలోని అదే కనాట్‌డ్రైవ్‌లో ఐ.ఎన్.ఏ. (ఇండియన్ నేషనల్ ఆర్మీ) మృతవీరుల సంస్మరణ సభ జరిగింది. అక్కడినుండే ఇంతకు ముందు అనేక వీరయువకులు సముద్ర కెరటాలవలె ఉత్సాహ ఉద్రేకాలతో పోరాటానికి పరుగులెత్తారు. పరాక్రమం చూపి విజయాలు పొందారు. వారిలో కొందరు వీర మరణం చెందారు.

సైనికులు తమ యూనిఫాంలో చేరారు. ఆనాడు స్వతంత్ర భారత పాఠశాలలకు సెలవు ప్రకటించారు కనుక, అందమయిన దుస్తులు ధరించుకొని త్రివర్ణ పతాకాలు పట్టుకొని స్కూలు పిల్లలు చేరుకున్నారు. వారు "జన గణ మన"

జాతీయ గీతం పాడుతూ వచ్చారు. బాలబాలికల భావి స్వేచ్ఛా సౌభాగ్యాల కోసమే కదా ఆ విముక్తి పోరాటాలు-వీరుల ఆత్మబలిదానాలు.



సరిగ్గా పదకొండు గంటలకు నేతాజీ సభా స్థలానికి వచ్చాడు. సాధారణముగా సైనిక సభలకు వచ్చినప్పుడు ఆయన మిలటరీ కాకీరంగు డ్రెస్సులో వుంటాడు. ఈ దినం మాత్రం తెల్లని చొక్కా, ధోతీ ధరించి టోపీ పెట్టుకున్నాడు నల్లటి సిల్కుగుడ్డ భుజాలమీదుగా కట్టుకుని గంభీరంగా కన్పించాడు.

జపాన్ ఆఫీసర్ల నమస్కారాలకు ప్రత్యుత్తర మీయకుండానే ముందుకు నడిచి భారతి జెండాను ఎగురవేశాడు.

జయ జయ నినాదాలు మార్మోగాయి.

సుభాస్ మైకు ముందుకు వచ్చి ఇలా అన్నాడు-

"దేశమాత స్వతంత్రత కోసం ప్రాణాలను అర్పించిన అమరవీరులకు శ్రద్ధాంజలి అర్పించడానికి మనమిక్కడ చేరాం...4 ఫిబ్రవరి 1944 మనం మొదటి ఆక్రమణ జరిపాం. అప్పటినుండి ఇప్పటివరకు మనసేన రక్తపుటేరుల్లపై ముందుకు నడిచింది. మన రక్తంతో తల్లికి హారతి పళ్ళెరం అలంకరించాం. ఇది ఆ రక్తపు బిందువుల సంకల్పాన్ని రాయిగా చేసి స్మృతి చిహ్నంగా నిలుపుకుంటున్న దినం..."

పాలరాతి పలకను స్మృతి బింబంగా నిలిపారు. సైనిక వందనం జరిగింది. పతాకాన్ని సగం క్రిందికి దించారు. ఆనాడు తేది 22 సెప్టెంబర్ 1944.

## నీతిపరులకైనా నిందలు తప్పవు

నేతాజీ ఆలోచన, ఆచరణ, పరాక్రమం బ్రిటిష్‌వారిని కంపింపజేసింది. ఇక బంగరుభూమి భారతదేశంలో తమకు నూకలు చెల్లిపోయినాయనుకున్నారు. వేపకు నిలువెల్లా చేదు, అన్నట్లు వారు దుష్టబుద్ధితో నేతాజీపై నేరారోపణలు చేయసాగారు.

బోసు దేశద్రోహి, శత్రుదేశమయిన జర్మనీతో చేతులు కలిపాడు. జపానుకు లోబడి భారతదేశాన్ని వారికి తాకట్టుపెడుతున్నాడు—ఇవీ వారి సూక్తులు.

అహింసా మంత్రపు మైకంలోవున్న గాంధీ, నెహ్రూలే ఆంగ్లేయుల మాటలు నమ్మి నేతాజీని దేశద్రోహి, జపాన్ బానిస అనగలిగారంటే ఇతర సామాన్యుల మాటేమిటి?

దానికి బోసు ఎంతగానో వ్యధచెందాడు.

"జపాన్ మన మిత్రులకు శత్రువుగా వున్నంతకాలం నేను అక్కడికి రాలేదు. బ్రిటన్, అమెరికాలకు వ్యతిరేకంగా జపాన్ యుద్ధం చేయడానికి పూనుకున్న తర్వాతనే నేను ఇక్కడ అడుగుపెట్టాను. బ్రిటిష్ ప్రభుత్వానికి విరుద్ధంగా పోరాడిన నావంటివారిని ప్రపంచంలో మరొక రాజనీతిజ్ఞుడు మోసం చేయగలడా?" అని వాపోయాడు. సూటిగా ప్రశ్నించాడు. ఏమంటే ఏముంది? చెవిటికి శంఖు ఊదినట్లు! నిందింపతలచినవారికి అందుకు ఏదో ఓ నెపం కావాలి కాని కారణాల నిజా నిజాలు కాదుకదా.

## కలిసిరాని కాలం

ఒక స్వతంత్ర భారత సేనాని శత్రువులతో చేతులుకలిపి రహస్యాలన్నీ తెలియజేశాడు. దానికి తగినట్లుగా బ్రిటిష్ సేన యుక్తిగా ముందుకు సాగింది వర్షారంభానికి ముందు ఇంఫాల్‌ను ఆక్రమించుకోవాలనుకున్నదీ ఐ.ఎన్.ఎ.కు వీలుకాలేదు. వానలుకూడా భారతసేనకు ఇబ్బందిని కల్గించాయి.

ఇంతలో అమెరికా మనీలాను కబళించుకొంది. జపాన్ విమానసేన అటు వెళ్ళవల్సి వచ్చింది. వీరికి సహాయం అందలేదు.

మిత్రరాజ్యాలు వాయుసేనతో కొహిమా, ఇంఫాల్‌లను ఆక్రమించు కున్నాయి. బ్రిటన్ విజయాలు పొందుతున్నది.

జపానీయులు టిట్టర్ నుంచి వెనుకకు కదిలారు.

డిసెంబర్‌లో చైనా, భామో పైన, బ్రిటన్ ముఖీడాంగ్ పైన అధికారాలు పొందాయి. అజాద్ హిందూ ఫౌజ్ బర్మా రక్షణకు వెళ్ళింది. జపాన్ సహాయం లభించలేదు.

నేతాజీ స్వయంగా యుద్ధరంగంలోనికి వెళ్లాడు. పిన్ పిన్ ఆంగ్లేయుల వశమైంది. వరుసగా బాంబుల వర్షం కురిపిస్తున్నారు.

నేతాజీతో సంప్రదించి షానవాజ్‌ఖాన్ కర్నల్ సహగల్ దగ్గరికి వెళ్ళాడు. పిన్‌కిన్ విముక్తిసేన వశమయినట్లు, శత్రువులు ఓడి పారిపోయినట్లు ఆయన తెలిపాడు.

మార్చి 5 వరకు శత్రువులు ముందుకు వస్తున్నట్లు తెల్పింది. బర్మా సేనలు జపాన్‌వారికి ఎదురు తిరిగాయి. మగోల్ బ్రిటన్ చేతబడింది.

జపాన్‌వాళ్ళు వెళ్ళిపోయారు. కేవలం భారతీయులే మిగిలివున్నారు. సుభాస్ సేనలను రంగూన్‌నుంచి వెనుకకు బ్యాంకాంగ్‌కు మళ్ళించి బర్మాలోని భారతీయులకు సందేశమిచ్చాడు.

"నేను చాలా ఆలోచనతో బర్మాను విడిచిపోతున్నాను. మేం భారత స్వతంత్ర సంగ్రామపు మొదటి మజిలీలో ఓడిపోయాం. కాని ఇలాంటి ఓటమ్లో

పోరాటాలు సాగుతాయి. ఈ ఓటమితో మనం ధైర్యాన్ని కోల్పోరాదు. భారత దేశం విముక్తి పొందుతుంది. స్వతంత్రంగా వుంటుంది. విప్లవం వర్ధిల్లాలి! ఆజాద్ హింద్-జిందాబాద్ జైహింద్"

సైనికులకిలా తన ఆశయాన్ని వివరించాడు.

"నేను మొదటినుంచీ ఆశావాదిని. ఏ పరిస్థితుల్లోనూ అపజయాన్ని అంగీకరించను. నేను మీ చేతుల్లో మన దేశ పతాకాన్ని, మన గౌరవాన్ని, మన వీరధర్మాన్ని ఉంచి వెళ్ళుతున్నాను. మీరూ నావలెనే ఆశావాదులుకండి. ఘోరాంధకారం రాబోవు ఉషోదయానికి సూచనగా భావించండి. భారతదేశం అతి త్వరలో తప్పక విముక్తి పొంది తీరుతుంది.

భగవానుడు మీకు శుభం కలిగించుగాక. విప్లవం వర్ధిల్లాలి! ఆజాద్ హింద్-జిందాబాద్! జైహింద్.

-సుభాస్‌చంద్రబోస్ (ప్రధాన సేనాపతి)"

## యుద్ధ ఫలితం

జర్మనీ రష్యాను ఎదిరించి పొరపాటుచేసింది. రష్యా ఎదురుదెబ్బతు జర్మనీ తలవంచవల్సివచ్చింది. మే 2న రష్యా సైన్యాలు బెర్లిన్ నగరం ప్రవేశించాయి. నార్వే, డెన్మార్క్, బెల్జియం, పోలెండు, గ్రీసు, యుగోస్లావియా,

బల్గేరియా, ఉత్తర ఆఫ్రికా రాజ్యాలు, ఫ్రాన్స్, రష్యాలో చాలాభాగం ఆక్రమించిన జర్మనీ నియంత హిట్లర్ ఆత్మహత్యచేసుకున్నాడు. జర్మనీ రెండు భాగాలయింది. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ సగభాగం, రష్యా తూర్పు సగం పంచుకున్నాయి.

మిత్రరాజ్యాలు (అమెరికా, బ్రిటన్, చైనా, రష్యా) జపాన్‌ను ఎటూ ఓడించలేక కలతచెందాయి.తుది ప్రయత్నంగా అమెరికా అతిఘోరమయిన క్రూర చర్యకు పాల్గొంది.

1945 ఆగస్టు 7వ తేదీన జపాన్‌లోని హిరోషిమా, 9వ తేదీన నాగసాకీ, నగరాలపై అణుబాంబులను ప్రేల్చింది. అది మహా భయంకరమయిన విధ్వంసకాండ. లక్షల జనం, కోట్లధనం క్షణంలో నూడి బూడిదగా మారాయి. మలయా, బర్మా, ఇండోనేషియా, సింగపూర్, థాయిలాండ్ హాంకాంగ్ ఆక్రమించిన జపాన్ చక్రవర్తి హీరో హిటో తన దేశవాసుల రక్షణకు ఆగస్టు 14వ తేదీన యుద్ధ విరమణ ప్రకటన చేశాడు.

మొదట విజృంభించి విజయాలు పొందిన అక్షరాజ్యాల అపజయంతో మిత్రరాజ్యాల జయంతో ఈ రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కోటీ ముప్పది లక్షలమంది పసిపిల్లలు మృతిచెందారు మూడుకోట్ల యాభై లక్షలమంది గాయపడడమో, వికలాంగులు

కావడమో జరిగింది. నది లక్షలమంది అనాథులయ్యారు. (విశ్వ విజ్ఞాన దర్శిని)

కోటి కోటిస్తు రూప్యాణి లక్ష సంఖ్యాక మానవాః

వినాశ కారకా యుద్ధాః కింతత్ క్రూర క్రియాద్యచ॥

(కోట్లకొలది రూపాయలను, లక్షల కొలది మానవులను విధ్వంస మొనరించునవి యుద్ధాలు. ఆ క్రూరకర్మలు (ఆటవిక దశ యందేర్పడినవి) ఇప్పటికినీ ఎందులకు?)- మానవగీత.

## నేతాజీ అమరుడు

ఇటు తన మిత్రదేశాలయిన జర్మనీ, ఇటలీ, జపాన్‌లు (అక్షరాజ్యాల కూటమి) యుద్ధంలో ఓడాయి. అటు భారత దేశంలో వైస్రాయి వేవెల్ గాంధీ-జిన్నాలను సంప్రదింపులకు పిలిచాడట. కాంగ్రెస్ వేవెల్ సంప్రదింపులకు అంగీకరించకూడదని సుభాసు ఆ విచారంలోనూ సింగపూర్‌నుంచి ప్రకటన జారీచేశాడు. వారి సంప్రదింపులు విఫలమయినందుకు సంతసించాడు.

బర్మాలో ఆజాద్ హిందూ సైనికులను, ఆఫీసర్లను బంధించి జైళ్ళలో నింపసాగాయి బ్రిటిష్ సేనలు.



నేతాజీ జపాన్ అధినేతతో సంప్రదింపులు జరపడానికి కర్నల్ హబీజర్ రహమాన్‌తోడుగా బ్యాంకాంగ్ నుంచి టోక్యో ప్రయాణమై విమానం యెక్కాడు.

అది 23 ఆగస్టు 1945. దారిలో పార్మోసా సమీపంలో ఆ విమా

నం అగ్నిప్రమాదానికి లోనై ప్రయాణీకులందరితో పాటు నేతాజీ సైతం మరణించి నట్లు వార్త వెలువడింది. దేశం శోకవ్యాకులతతో అతలాకుతలం అయింది.

భారత స్వాతంత్ర్య పోరాటంలో అమోఘ సాహస వీరుడు, అమర వీర నక్షత్ర రాశిలో సుభాస్ శాశ్వత ప్రకాశంకల ధృవతార.

